# HERO OF BUDDHISM

## (TELUGU)

BY

PANDIT, V. V. KRISHNA SARMA

E. M. GOPALAKRISHNA KONE
Educational Publisher,
MADURAI :: :: MADRAS

 [Price As. 10

# HERO OF BUDDHISM

## (TELUGU)

---

BY

PANDIT, V. V. KRISHNA SARMA

---

E. M. GOPALAKRISHNA KONE

Educational Publisher,

MADURAI :: :: MADRAS

 [Price As. 10

# పీఠిక



బౌద్ధకీరుఁడను పుస్తకమును నిన్నటి దినమున మిత్రులు నాకిచ్చి పీఠిక వ్రాయుమనిరి. కార్యాంతర నిమగ్నుఁడనై యుండుటచే గ్రంథమును జదువుటకు నాకుఁ గొంతకాలము గాఁక తీఱిక యుండలేదు. అందువలన నక్కడక్కడ ఇంచుక చూచితిని. ఇట్టి రీతి గ్రంథములు ప్రాచీన చరిత్రలను విశదీకరించును. అశోకాదులను గూర్చి యెందఱో తెలుఁగున వ్రాసియున్నారు. కాని ఆంధ్రదేశము వారెల్లకాలమును ఆ క్రేతగుల గౌరవములనే వెల్లడించుచుఁ గూరుచుండవలెనా? — అందువలన విద్వత్కవులు, నాసికఁ బగిన హైతిమూఁగిల శ్రీ గ్రంథకర్తగారు ఇఁక ముందు జగత్సకీర్తి విఖ్యాతులైన ప్రాచీనాంధ్ర మహాశయుల చరిత్రములను, ఆ ప్రజ జీవనోత్తేజకములగు మన దేశభాషలను సంబంధించిన విషయములను వ్రాసి, ఆంధ్రత్వసిద్ధికిఁ దోడు చూపుదురు గాక. ప్రకృతపు "బౌద్ధకీరుఁడు" సర్వజనాదరణ పాత్రమగుఁ గాక యని తలఁచుచున్నాను.

వేపేరి,
చెన్నపురి,
**14—11—1932.**

ఇట్లు
బుధ విధేయుఁడు,
తేకుమళ్ల రాజగోపాలరావు.

# విషయసూచిక



| సంఖ్య. | విషయము. | పుట. |
| --- | --- | --- |
| 1. | పూర్వ చరిత్రము | 1 |
| 2. | అశోకుని జననము | 6 |
| 3. | యువరాజు | 11 |
| 4. | సుమానుఁడు | 15 |
| 5. | అశోకుని క్రూర స్వభావము | 20 |
| 6. | అశోకుని తొలి మతము | 26 |
| 7. | అశోకుని బౌద్ధ మతావలంబనము | 29 |
| 8. | అశోకుని నూతన స్వభావము | 35 |
| 9. | అశోకుని బౌద్ధ మతప్రచారము | 39 |
| 10. | బౌద్ధ మత సిద్ధాంతములు | 43 |
| 11. | అశోకుని రాజ్య వైభవము | 47 |
| 12. | అశోకుని లోకోపకారములు | 54 |
| 13. | అశోకుని సదుపదేశములు | 58 |
| 14. | అశోకుని శాసనాదికములు | 63 |
| 15. | అశోకుని స్తూపములు | 68 |
| 16. | అశోకుని [illegible]ంతరములగు కట్టడములు ; ప్రతిమలు | 71 |
| 17. | సింహళద్వీపము, బౌద్ధమతము | 75 |
| 18. | అశోకుని సంతానము | 80 |
| 19. | అశోకుని నిర్యాణము | 84 |

శ్రీ ర స్తు

# బౌద్ధ వీ రుం డు



## ౧. పూ ర్వ చ రి త్ర ము

గ్రీకు సార్వభౌముఁడగు నలెగ్జాండరు ప్రపంచమంతయు జయించి యేకచ్ఛత్రముగఁ బాలింపవలయునని తలంచి, స్వదేశమునుండి బయలువెడలి, యనేక దేశంబుల జయించి, తుదకు హిందూదేశముపైకి దండెత్తి వచ్చెను. అలెగ్జాండ రిండియాపైకి దండెత్తి వచ్చినపుడు పాంచాల జనపదంబులను బురుషోత్తముఁడను నొక హైందవ నృపాలుఁ డేలుచుండెను. అతఁడు భుజబల పరాక్రమ సంపన్నుండగు రాజపుత్రవీరుఁడు. అతఁడలెగ్జాండరు నెదిరించి రణమొనర్చి తుద నోడిపోయెను. అలెగ్జాండ రతని సాహసాదులకు మెచ్చి తదీయ రాజ్యము మరల నాతని స్వాధీనమొనర్చి, యప్పటినుండి యతనితోఁ జెలిమి పాటించెను.

అలెగ్జాండ రిండియాను వదలి మరలిపోవునపుడు మార్గమధ్యమున విషజ్వర పీడితుఁడై 'బాబిలో' నను పట్టణమున మరణించెను. అతని యనంతర మతని రాజ్యము నాతని సేనానాయకులు వశపఱచుకొనిరి. 'సెల్యూకస్' అను నతఁ డలెగ్జాండరు సేనాపతులలో నుత్తమోత్తముఁడు. ఇతఁ డొక పెద్ద సేనను సమకూర్చుకొని హిందూదేశమును జయింపవలయునని దండెత్తి వచ్చెను.

అక్కాలమున హిందూదేశమున నందవంశరాజులు పరిపాలించుచుండిరి. ఆ వంశమునకు సంబంధించిన కడపటి రాజొకఁ డొక శూద్రస్త్రీని వరించి పెండ్లాడెను. ఆమె పేరు మురా. ఆమెయందా రాజునకు జనించిన కుమారుఁడే చంద్రగుప్తుఁడు. చంద్రగుప్తుఁడు బాల్యముననే భుజబల పరాక్రమములకుఁ బ్రసిద్ధి వహించినవాఁడు.

నందులచేఁ బాలింపఁబడుచుండిన మగధరాజ్యమునఁ జాణక్యుఁడను విఖ్యాతపురుషుఁ డొకఁడుండెను. ఆతఁడు భూసురకులోత్పన్నుఁడు. ఆతని నందులొకపరి పరాభవించుటం జేసి; యతఁ డందులకుఁ బ్రతీకార మొనరించి, నందులపైఁ దనకుఁ గల పగఁ దీర్చికొనవలయునని సంకల్పించి యుండెను. చాణక్యుఁడు రాజనీతి ప్రవీణుఁడు. ఇతనికిఁ గౌటిల్యుఁడనియు, విష్ణుగుప్తుఁడనియు నామాంతరములు గలవు. ఇతఁ డర్థశాస్త్రమును

నొక గ్రంథమును రచియించెను' ఆ గ్రంథము మూలముగ మన మా కాలపు రాజ్యాంగ పద్ధతులను గూర్చి తెలిసికొనఁ గలము.

చాణక్యుఁడు తన్నుఁ బరాభవించిన నందులపైఁ "బగఁ దీర్చుకొనవలయునన్న సంకల్పము నెఱవేఱుట కొక మార్గము అచిరకాలముననే సిద్ధించెను. నందులు చంద్రగుప్తుని నిర్మూలింపఁ దలంపుఁగొనిరి. కానఁ, జంద్రగుప్తుఁడును వారి నెట్లయినఁ బరిమార్చి రాజ్య మాక్రమించుకొన నుంకించుచుండెను. కాని నిస్సహాయుఁడగు తానెవని తోడ్పాటునఁ దనమనోరథ మీడేర్చుకొనవచ్చునా యని యాలోచించుచుండెను. తుదకుఁ దనకు రాజ్యాంగతంత్రము నుపదేశించుచుండిన మన చాణక్యుఁడు జ్ఞప్తికి వచ్చెను. వెంటనే యతని నాశ్రయించి, తన యభిలాషము నెఱవేర్పఁ గోరెను. చాణక్యుఁడును జంద్రగుప్తుని సౌజన్యమును కలరి, నందరాజ వినాశసమునకుఁ దగు నుపాయముల బోధించి, తనవలన నైన సర్వసహాయములఁ జేసెను.

చంద్రగుప్తుఁడు చాణక్యోపదిష్ట మార్గమ్మున మగధ రాజ్యమును సాధించి, మూర్ధాభిషిక్తుఁడై తనకుఁ బ్రధానిగఁ జాణక్యునే నియమించుకొనెను. చాణక్యుఁడును నందవంశ నిర్మూలనముచేఁ దన యంతస్తాప మడఁగంటనందులకు మిగుల నానందమొందెను.

అలెగ్జాండరు వీరుని వాహినీపతియగు సెల్యూకస్ నికడర్ హిందూదేశముపై దండెత్తి వచ్చినపు డుత్తర హిందూస్థానమున రాజ్యము సేయుచుండిన మహీపతులలోఁ జంద్రగుప్తుఁడే ప్రబలుఁడు. సెల్యూకసు నీతఁ డెదిరించి యోడించెను. పిదప సెల్యూకస్ చంద్రగుప్తునితో సంధిచేసికొని చెలిమి వాటించి యతని ముఖ్యనగరమగు పాటలీపుత్త్రమున ‘ మెగాస్తెనీస్ ’ అను తన రాయబారి నొకని నిలిపి తన దేశమునకు మరలిపోయెను.

చంద్రగుప్తుఁడు తన భుజబల పరాక్రమాదులచేతను, న్యాయపరిపాలనముచేతను బ్రజానురంజకుఁడుగఁ బ్రకాశించెను. ఇతఁడు నర్మద వఱకును దన సామ్రాజ్యమును వ్యాపింపఁజేసెను.

మెగస్తెనీస్ పాటలీపుత్త్రమునఁ దా నుండిన కాలమును వ్యర్థపఱుపక, యుపయోగకర కార్యములయందే వినియోగించుచుండెను. అతఁడా కాలపు నాగరికతం గూర్చి యొక గ్రంథమును వ్రాసెను. దానిలోనుండి మన మనేక విషయములను గ్రహింపవచ్చును.

ఆ గ్రంథమునందుఁ బాటలీపుత్త్రి ముత్తమయోధవారసంకులముగ నుండెననియుఁ, బ్రతిపక్షు లా పట్టణరాజమును సులభముగ వశపఱచుకొన లేనంతటి రక్షణ మద్దానికిఁ గలిగి యుండెననియు, నా వీటమాత్రము నాలుగు లక్షల యుద్ధవీరు

లుండిరనియు, మూలబలమున నాలుగులక్షల పదాతులును, మూఁడు లక్షల గుఱ్ఱపు రౌతులును, తొమ్మిదివేలమంది గజారోహకులును నుండిరనియు మెగాస్తెనీస్ వ్రాసియున్నాఁడు.

చంద్రగుప్తుఁ డిరువదినాలుగేండ్లు రాజ్యపరిపాలన మొనరించెను. చంద్రగుప్తుని తల్లిపేరు ముర. కావున, నాతని వంశమునందలి రాజుల కందఱికిని 'మౌర్యవంశ రాజు' లను పేరు వచ్చినది. మౌర్యవంశములోని మొదటి రాజగు చంద్రగుప్తుఁ డనేక దేశములం జయించి యేకచ్ఛత్రముగఁ బాలించినందున నతనిని 'మౌర్యవంశ ప్రథమ చక్రవర్తి' యని యనవచ్చును.



# ౨. అశోకుని జననము

చంద్రగుప్తుని యనంతర మాతని కుమారుఁడగు బిందుసారుఁడు సింహాసనము నధిష్ఠించెను. ఇతఁడు నిజ జనకునిచే సంపాదింపఁబడిన మౌర్యసామ్రాజ్యమును విస్తరింపఁజేసెను. ఇతఁడు దక్షిణ హిందూస్థానము నందలి కొన్ని భాగములను గూడ జయించి తన రాజ్యమునఁ గలుపుకొనెను. ఇతనికి 'అమృతకేతువు' 'శత్రునాశకుఁడు' అను బిరుదు లుండెను.

రాజ్యాధిపతు లెందఱు కాంతలనైనఁ జేపట్టు నాచారము పూర్వకాలమున వాడుకలో నుండినందున బిందుసారుఁడు పదు నార్గురు సుదతులం జెట్టవట్టి తనరాణులుగ జేసికొనెను. వారి యం దితని కేకోత్తర శతసంఖ్య గల సుతు లుద్భవించిరని తెలియుచున్నది. వారిలోఁ బ్రథముఁడు 'సునాముఁ' డనువాఁడును; గడపటియాతఁడు 'తిస్సా' యనువాఁడును. మన కథానాయకుఁడగు నశోకుఁడు రాజపుత్త్రులలో మూఁడవ వాఁడని చరిత్రకారులు వ్రాసియున్నారు.

బిందుసారుఁడు రాజ్యమేలుకాలమునఁ జంపాపురి యను పట్టణమున నొక విప్రోత్తముఁడుండెను. ఆతఁడు నిఱుపేద.

కతని కొక కుమార్తె యుండెను. ఆమె మిగుల సౌందర్యవతి. సౌందర్యమునకుఁ దోడామెకు సద్గుణపుంజ మలవడి యుండెను. ఆమె పేరు సుభద్రాంగి.

ఆ కన్నియ కాలక్రమమున యౌవన మలంకరించెను. అపుడా బీదబాఁపఁడు తన తనూజకుఁ దగిన వరు నన్వేషింప నారంభించెను. కాని యందుఁ గృతార్థుఁడు గాకపోయెను. ఇట్లుండ నాతని మందిరమున కొకనాఁడొక జ్యోతిష్కుఁ డెట నుండియో యరుదెంచి యాతిథ్యముం గ్రహించి, ప్రస్తావవశమున సుభద్రాంగి విషయమును విని, యామె జాతకముం దెన్నని పరిశీలించి చూచి, యామె శీఘ్రకాలముననే యొక మహారాజుం జెట్టవట్టునవియు, నామె గర్భమున మహామండలేశ్వరుఁడొకఁ డుద్భవింప నున్నాఁడనియుఁ, దన జ్యోతిష మెన్నఁడు నసత్యము గానేరదనియుఁ జెప్పి చనియెను. అతని మాటలాలకించి యాభూసురుఁ డత్యంత హర్ష నిర్భర చేతస్కుఁడై నాఁటనుండి సుభద్రాంగిం గడు గారాబముతోఁ బెంచు చుండెను.

బింబుసారుఁ డొకనాఁడు సుభద్రాంగి నివసించు చంపాపురి కరుగవలసిన సందర్భమొండు సంభవించెను. అప్పుడా పురమునందలి యొక కొందఱొకన్నియ రూపరేఖా విలాసాదులం గూర్చి రాజుకడ నుగ్గడించిరి. రాజును నట్టి వనితారత్నము

తన యంతిపురము నలంకరించినచోఁ దనకుఁ ద్రిభువనలక్ష్మి చేకూఱినట్లని తలంచి, యామె తండ్రిం బిలిపించి, తన యభిలాషముం దెలుపుడు, నాతండును బరమానందంబున నంగీకరించి, సుభద్రాంగి నాతనివెంటఁ బాటలీపుత్త్రమునకుం బంపెను.

భూపాలుఁ డప్పాటలాధరపై నెక్కువ మక్కువఁగొని, తక్కిన భార్యలకంటె మించిన యనురాగముతో నామెం గాంచుచుండెను. అందుచే నామెపైఁ దక్కిన రాజకాంతల కందఱకు మచ్చరము హెచ్చెను. కాన వారంద ఱొక్కటిగఁ జేరి సుభద్రాంగిని రాజనగరున వఱ్ఱడమునకు నియోగించిరి.

బిందుసారుఁడొక నాఁ డేకాంతమున నుండి సుభద్రాంగిం బిలిపించి, తనకుఁ దల దువ్వుమనియెను. ఆ తన్వంగియు విన యవిధేయతలు తన లావణ్యమునకు మెఱుఁగుఁ గూర్పఁ బతి యానతి నెరవేర్చుచుండెను. అట్టి యదనున నాస్థలమునఁ దా మిరువురు తప్ప మఱెవ్వరు లేకుంట నెఱింగి సుభద్రాంగి నాథునికిఁ దన మనోరథములఁ దెలుప నుద్యుక్తురాలయ్యెను. 'వెదుకఁబోయిన తీవియ పదములఁ దగులువడి'నటుల భావజ్ఞుఁడగు భూవరుండును నామె తనకొనర్చిన సేవకు సంతసమంది "సతీమణీ! నీ యభీష్టమెయ్యది? జంకులేక యడుగుము. అది యెట్టిదైన నెఱవేర్చెద" ననియెను. ప్రీతిపూర్వకములగు భర్త

పలుకుల నాలించి సుభద్రాంగి తన కదృష్టకాలము సమీపిం చెనని యుప్పొంగి రాజుం జూచి “ప్రియా! కాంతలకుఁ గాంతు నాదరముం గాంచుటకంటె మిగిలిన యభీష్టమెయ్యది కలదు? తాము నన్నెంతయు గారాబముననే వీక్షించుచుంటిరి. అయినను దమకుఁ బట్టమహిషినిగాఁ బరిచర్య లొనర్ప నాస గలదు. అనుగ్రహించి యీవరము దయసేయుఁడు” అని వేడెను. మఱియుఁ దనకు సవతులచేఁ గలుగు పరాభవముల నన్నిఁటిని వివరించెను.

రాజును సుభద్రాంగికి సపత్నుల వలనఁ గలిగిన కష్టముల కతి విచారముం జూపి, యామె సౌందర్యమునకును సద్గుణము లకును మిగుల మోదించి యామెం బ్రశంసించెను.

సుభద్రాంగి కాంక్షించినరీతి నామెను రాజు శాస్త్రోక్త ముగఁ దనకుఁ బట్టపురాణిం గావించుకొనియెను. వేల్పులేమలు సయితము చూచి లజ్జింపఁదగిన యందముతో సుభద్రాంగి యలరారుచుండెనని చరిత్రకారులు వ్రాసియున్నారు. అట్టి భువనమోహిని యగు నర్ధాంగి నత్యంతముఁ బ్రేమించి రాజా మెతోఁ బూవుందావియువలె నవిరతము గలసిమెలసి యుండు టలో నాశ్చర్యమేమున్నది? — సుభద్రాంగీ బిందుసారుల మేనులు రెండయినను నాత్మమాత్ర మొక్కటియే యనునట్లు ఐక్యభావముతో మెలఁగుచుండిరి.

ఈ దంపతుల యవ్యాహతానోన్యన్య ప్రేమమే శరీరముం దాల్చి వెలువడెనా యన్నటుల కాలక్రమమున వీరికొక పుత్త్ర రత్న ముదయించెను. ఆ బిడ్డను ప్రసవించుకాలమున సుభద్రాంగి కేమాత్రమును గష్టము గలుగకుండెను. అందుచే వారా శిశువున ' కశోకుఁ ' డని పేరిడిరి. మరల రెండేండ్లకామె యొండొక కుమారుఁ బ్రసవించెను. అప్పుడును నామె కేమియు బాధ లేకుండెను. కాన నారెండవ పుత్త్రునకు ' వీతాశోకుఁ ' డని నామకరణ మొనర్చిరి. ఈ యిరువురు కొమరులును శుక్లపక్ష చంద్రునిమాడ్కి దినదినాభివృద్ధి నొందుచుఁ దమ బాల్యక్రీడలచే నంతిపురమునం దెల్లవారికి ముద్దులు గొలుపుచుండిరి.



# ౩. యువరాజు

సుభద్రాంగి యత్యంత సౌందర్యవతియయ్యు, నామె కుమారుఁడగు నశోకుఁడు మాత్రము సొగసుగలవాఁడు గాకుండెను. అతనికిఁ గురూపమునకుఁదోడు క్రూరకృత్యములయందిచ్ఛయు నుండెను. ఆతని చిన్నప్పటి యూహాలును నడవడికలును గన్నవారెల్ల నాతనియం దేవగొనుచుండిరి. అయినను 'కాకిపిల్ల కాకికిముద్దు' అను సామెత చొప్పున సుభద్రాంగి మాత్ర మాతని యందమిత పక్షపాతముఁ జూపుచుండెను. అశోకునకుఁగూడఁ దన కుమారుని దుష్టచేష్టితము లసహ్యకరములుగ నుండెను. కానఁ బలుమాఱు నట్టి గుణములనుండి కుమారుని విముఖునొనర్పఁ బ్రయత్నించెను; కాని నిష్ప్రయోజనమయ్యెను.

అశోకుఁడు బాల్యమునఁ దనతో నాడు బాలకుల హింసించి యానందించెడి వాఁడఁట. అందుచే బాలకు లశోకు నెటనేనిఁ గాంచుట తటస్థించుచో "ఈ దుష్టుఁడు మనకెంక నేమి యాపదఁ గలిగించునో కదా?" యని భయభ్రాంతులై దాఁగుకొనువారఁట.

సింహళద్వీపమున నశోకునిఁ గూర్చి వ్యాప్తములయి యున్న కథలలో నొకదానియం దతఁడు చిన్నతనమున మిగుల దుష్టుఁడుగ నుండినట్లు చెప్పఁబడియున్నది.

ఇట్టి సర్వజనబాధాకరుఁడగు నశోకునిఁ బ్రధాన నగరము నుండి తఱిమివేయవలయునని బిందుసారుఁ డూహించుచుండఁ బంజాబునందలి సామంతులు చక్రవర్తి యగు తనకు విరోధముగఁ గుట్రలు పన్నుచున్నట్లు వర్తమానము తెలియవచ్చినది. వెంటనే యక్కడి యంతఃకలహముల నణఁచ రాజశోకునిం బంపెను. అశోకుఁడును దండ్రియానతిం దలఁదాల్చి పాంచాలమునకుఁ బ్రధాన నగరమగు తక్షశిలకుఁ జేరెను.

రాజకుమారుని రాకకుఁ దక్షశిలవాసు లానందభరితులై, యాతని ననేకోపాయనములతోడ నెదుర్కొని సత్కరించి పట్టణములోనికిఁ దోడ్కొని చని రి. వా రశోకునితోఁ దమ్ముఁ బాలించు రాజప్రతినిధి యనేక విధములగు నిక్కట్టులఁ దమకుఁ దెచ్చిపెట్టుచున్నాఁడనియుఁ, గావున నాతని యక్రమము లణంచినఁ గాని తమకు సౌఖ్యములేదనియు, ధర్మాత్ముఁడగు బిందుసారుని పాలనమున నీ రాజప్రతినిధి వలని బాధలుతక్క నింకనే విషయమునను దమకు గోరంతయుఁ గొఱంతలేదనియు విన్నవించిరి.

అశోకుఁడు సావధానముగ వారి మొఱ్ఱల నాలకించి, యవి వాస్తవములని తనకుఁ దోఁచఁగనే, వారికిఁ దనవలన నైనంత సహాయమొనర్చి, యెల్లకష్టములఁ బోకార్చెదనని వాగ్దానమొసంగి, యక్కడనే కొంతకాలముండి, తాఁజెప్పినట్లు చేసెను. అంతియకాక యతఁడు తక్షశిలలో నున్నపుడు కాశ్మీరదేశమును స్వాధీనమొనర్చికొని తమ రాజ్యముతోడఁ జేర్చికొనియెను.

అశోకుఁడు తక్షశిల యందేర్పడిన కలహముల నివారించుటయుఁ, గాశ్మీరమును దమ రాజ్యమునఁ గలుపుటయుఁ గాంచి బిందుసారుఁడు మిగుల ముదమంది, యతని నుజ్జయినికి రాజప్రతినిధిగ నియమించి పంచెను.

పూర్వకాలమునఁ జక్రవర్తులు తమ జ్యేష్ఠతనయులను మండలాధిపతులనుగ నియమించు నాచారముండెడిది. కావుననే తదనుగుణముగ బిందుసారుఁడును నశోకుని నుజ్జయినికిఁ బాలకునిగ నేర్పఱచెను.

ఉజ్జయినికి రాజప్రతినిధి పదవిం బొందిన యశోకుఁడు తక్షశిలను వదలి యచ్చటి కేఁగునపుడు మార్గమధ్యమున నొక విషయము సంభవించెను. దానిం గూర్చి యిట సంగ్రహముగఁ దెలిపెదము:—

తక్షశిలనుండి యుజ్జయినికిఁ బోవుమార్గమున 'చైత్యగిరి' యను పట్టణ మొండుండెను. ఆయూర నొక వణిజుఁడుండెను.

ఆతనికి 'దేవి' యను రూపఖనియగు పుత్త్రిక యొకర్తుక యుండెను. అశోకుఁడా బాలికం జూడఁ బటస్థించెను. నాఁటి నుండి యా కన్నియపై గాఢముగ నాఁటిన తన నయనముం ద్రిప్పుకొననేరక యతఁడామెను దోఁచుకొని చని వివాహమా డెను. ఆమె యందతని కొక పుత్త్రుఁడును నొక పుత్త్రికయుఁ గలిగెది. పుత్త్రునిపేరు మహేంద్రుఁడు; పుత్త్రికపేరు సంఘమిత్త్ర.

అశోకుఁడుజ్జయినిని రాజధానిగఁ జేసికొని యూరాష్ట్రముఁ నేలఁ దొడంగెను.

ఉజ్జయిని సామాన్య నగరమేయైనను, నది పూర్వకాల మునుండియు మహాప్రఖ్యాతిఁ గాంచినది. పూర్వమా పట్టణము నకు 'అవంతి' యని పేరుగూడ నుండినట్లు పురాణములు వలనఁ దెలియుచున్నది. అయ్యది పుణ్యపురీసప్తకమున నొక టిగఁ జిరకాలమునుండి భారతీయులచే నెన్నఁబడుచున్నది. ఈ యుజ్జయినీ నగరమునఁ బ్రస్తుతమొక పెద్ద నక్షత్రశాలగలదు. హిందూదేశమునందన్ని ప్రదేశములలోను గంటలలెక్క యీ పురము గంటలలెక్క ననుసరించియే లెక్కింపఁబడుచున్న యది. మౌర్యరాజుల కాలమున నీ పట్టణము వర్తక వ్యాపార ములకుఁ జాలఁ బేరువడసి యుండెను.

---

# ౪. సుమానుఁడు



అశోకుఁడు తక్షశిలను వదలి యుజ్జయిని కేఁగఁగనే మరలఁ దక్షశిలవాసులు కలహములకుఁ బ్రారంభించిరి. ఆ వృత్తాంతము నాలించి బిందుసారుఁడీసారి తన పెద్ద కొమరుఁడగు సుమానుని నొక పెద్ద సేనతోఁ గూడఁ దక్షశిలకంపెను. సుమానుఁడును దండ్రియానతిమెయి నా ప్రోలింజేరి తనవలన నైనంతవఱకుఁ బ్రయత్నించెను; కాని కలహము లడఁగు సూచనలు గనఁబడవయ్యెను.

ఇంతలోఁ బాటలీపుత్త్రమున బిందుసారుఁడు దుర్వార వ్యాధిపీడితుఁడై పడకఁబట్టెను. క్రమక్రమముగ రోగము ప్రబలుటచే నతఁడు దన కంత్యకాలము సమీపించెనని యెఱింగి యుజ్జయినిలోనున్న యశోకుం దక్షశిలకుఁ బంపి, యటనుండి సుమానునిఁ బిలిపించవలయునని తన మంత్రులలో ముఖ్యుఁడగు కాలదాహున కాజ్ఞాపించెను.

కాని కాలదాహుఁడు ప్రభునాజ్ఞకు విరోధముగ నశోకుని రప్పించెను. ఇందులకుఁ గారణములేకపోలేదు. సుమానుఁడు బాల్యమున నున్నప్పు డొకనాఁడు రాజోద్యానమునకు

విహారమునకై యేఁగి తిరిగివచ్చునపుడు కాలదాహముఁ డెదురుగ వచ్చెననియు, నతఁడు ముఖ్యసచివుఁడని తెలియక సుమానుఁ డాతనిపైఁ దనపాదరక్షల విసరివైచెననియు, నప్పటినుండియు మంత్రియాతనిపైఁ బగఁబూని యది యెట్లుతీరునాయని యాలోచించుచుండెననియు, నెట్లయిన నతనిని బిందుసారునకుఁ బిదపఁ బట్టమునకు రాకుండఁజేయ సంకల్పించెననియు, నందులకుఁ దగినట్టిప్పుడు రాజాజ్ఞాపించిన ట్లతని పెద్ద కుమారుఁడగు సుమానునిఁ గాక, యశోకుని రప్పించెననియు, నశోకునిఁ జూడఁగనే బిందుసారుఁడు దిగులువడి గుండెవగిలి మరణించెననియు, వెంటనే తన యభీష్టప్రకార మాప్రధాని యశోకుని రాజ్యమునకుఁ బట్టముగట్టెననియు నొక పక్షమువారు వ్రాసియున్నారు.

మఱియొక పక్షమువారు:—రాజాజ్ఞా ప్రకారము మంత్రి యశోకునే రావించినను, సుమానుఁడు వచ్చువఱకు రాజ్యము నశోకుఁడే వహించుచు, నతఁడు వచ్చినవెంటనే యతనికిఁ బట్టముఁ గట్టవలయునని బిందుసారుఁ డేర్పాటొనర్చి మరణించెనని వ్రాసియున్నారు.

విషయము లెట్లున్నను బిందుసారుని యనంతరము రాజ్యము నశోకుఁడే కైవసమొనర్చుకొనెననుటయం దిసుమంతయు సందియములేదు. ఎందుచేతనన, రాజ్యము స్వాధీనపఱచుకొనుటలో నతఁడెంతయుఁ బ్రయాసపడవలసి వచ్చె

ననియు, సులభముగ నది లభ్యపడలేదనియుఁ దెలియు చున్నయది.

బిందుసారుఁడు మరణించెనన్న వార్త విన్నవెంటనే మహారాజ ప్రథమపుత్త్రుఁడగు సుమానుఁడు సేనను సమకూర్చు కొనివచ్చి పాటలీపుత్త్రమును ముట్టడించెను. ఈ సందర్భమున నశోకునకుఁ దోడ్పడినవాఁడు రాధాగుప్తుఁడను సచివసత్తముఁడు. అతఁడశోకునితోఁ గూడఁ గూడుకొని తమపై దండెత్తిన సుమాను నెదిరింప సంసిద్ధుఁడయ్యెను.

సుమానుఁడు పాటలీపుత్త్ర బహిఃప్రదేశమున నశోకునిం దలపడెను. ఇరువురకును ఘోరయుద్ధము నడచెను. కాని యశోకుఁడు స్వయముగ శౌర్యవంతుఁడగుటవలనను, దన తండ్రి యొక్క సైన్యము తన పక్షమున విశేషముగ నుండుటవలనను, రాధాగుప్తుఁడు తనకుఁ దోడునీడగ మెలంగినందువలనను, సుమానుని సైన్యము మార్గాయాసమువలన బడలియుండినందు నను సులభముగఁ దన సోదరుఁడగు సుమానుని జయింపఁ గలిగెను.

ఇట్లు విజయముం బడసిన యశోకుఁడు, తనకుఁ గీడొంచిన సుమానుఁడు మొదలగు బంధువుల నిర్మూలమొనర్పుమని యొక సేనాధిపతి కాజ్ఞాపించినట్లును, నతఁడందుల కంగీకరింపక

పోఁగాఁ దానే స్వహస్తములతో సహోదరులను బంధువు
లను జంపెననియుఁ గొందఱు వ్రాసిరి. రాజానుజులలో నొకఁ
డగు దిష్యుఁడు మాత్రము సన్న్యాసము స్వీకరించినందున నత
నిని మాత్రమశోకుఁడు ఛంపక వదలిపెట్టెనని తెలియుచున్నది.

కాని, పై చరిత్రకారుల వ్రాఁత లసత్యములని యశోకునిచే
స్థాపింపఁబడిన శిలాశాసనములను స్థూపములను బరిశీలించిన
వారి కెఱుకపడక మానదు. అతనికాలమున నతని సోదరీసోద
రులును బంధుజాలమును జీవించియున్నట్టులే శాసనాదికములు
వాకొనుచున్నవి.

యుద్ధమున నోడిపోయిన సుమాను నశోకుఁడు వధించె
నని యొక వదంతియు, నతఁడేదే నొక మంత్రప్రభావముచేఁ
ద ప్తతైలకటాహమునఁ ద్రోయఁబడి యందు మునిఁగి యుండె
నని మఱియొక వదంతియుఁ గలదు. కాని యిందేది నిజమో
మనము నిర్ధారణమొనర్పఁజాలము. మొత్తమున కశోకుని జీవిత
కాలముననే యాతఁడు మరణించెనని తెలియుచున్నది.

సుమానుఁడు మరణించునప్పటి కాతని సతీరత్నము
సంపూర్ణ గర్భవతిగా నుండెను. ఆమె యశోకుని బాఱినుండి
తప్పించుకొనుటకై, నిజనాథుని మరణానంతరము నగరునుండి
వెలువడి ముఖ్యపట్టణమున కనతిదూరముననున్న యొక జన

పదముం జేరి యందలి నీచజాతుల కధిపతియగు నొకనియింటఁ దలఁ దాఁచుకొనఁ బోయెను. ఆమె స్థితిఁ జూచి కనికరించి యా నాయకుఁడామెను తన సహోదరివలెను మాతృతీరుసను నాదరించి యేడేండ్లు కాపాడెను. ఆమె యా నాయకునింట నడుగిడిననాఁడే యామెకొక పురుష శిశువు గలిగెను. ఆబిడ్డనికి న్యగ్రోధుఁడని నామకరణము చేయఁబడినది. ఆ బుడుతఁడు పుట్టునపుడే సర్వజన వశీకరాకారముతో ముద్దులు గులుకుచుండుటచే నాయకుఁడెంతయు గారాబముతో వానిఁ బెంచుచుండెను.



# ౫. అశోకుని క్రూరస్వభావము

అశోకుఁడు చిన్నతనమునుండియే కఠినకార్యముల కల వాటుపడియుండెను. ఆయలవా టధికారధోరణి ననుసరించి మఱెంత హెచ్చెనని యనేకోదాహరణములవలనఁ దెలిసికొన వచ్చును.

ఒకనాఁడశోకు నాస్థానములోని ప్రధానులలో నేనూఱు గురతఁడు చేసిన యొక యకార్యమును ఖండించి మాటలాడిరి. అంత నశోకుఁడు వారిపైఁ బట్టరాని యాగ్రహము వహించి వారి శిరములను స్వహస్తములతోఁ గడు భయంకరముగ నఱికి వైచెను.

మఱియొకనాఁ డాతని యంతఃపుర కాంతామణు లేవే విదో విషయము లుబుసుపోకకై ముచ్చటించుకొనచు, సందర్భవశమున నశోకుని కురూపముం గూర్చి ప్రస్తావించు కొనుచుండిరి. అప్పుడు కారణాంతరమున నటకు వచ్చిన యశో కుఁడు వారిమాటలఁ జాటున నాలించి, వారిపైఁ గోపించి తత్‌ క్షణము వారినెల్లర దహింప నాజ్ఞాపించెనఁట. అట్లు దహనదండ

నముం బొందిన యబలారత్నముల సంఖ్య యేనూఱని తెలియు చున్నది.

ఒండొకనాఁ డతనిచే నతిప్రేమతోఁ జూడఁబడుచుండిన యొక యశోకవృక్షమును ఛేదించినందులకయి యొక కొందఱు సుందరుల కతఁడు మరణదండనము విధించెనని యొక కథ కలదు.

అశోకుఁడు తనకుఁగల యధికారమును సంపదనుబట్టి తనకు మించిన రాజెవఁడును నుత్తర హిందుస్థానమున లేఁడని గర్వించి, తానే యింద్రుఁడననియుఁ, దన రాజధానియగు పాటలీపుత్త్రమే యమరావతి యనియుఁ దలంచుచుండెను. అందుచే నతని క్రూరకార్యముల కెదురు లేకుండెను. మరణదండనము విధింపఁబడినవారి నాతఁడు స్వహస్తములతో సంహరించుచుండెను.

రాజిట్టి కృత్యము స్వయముగ నెఱవేర్చుటం గాంచి యతని మంత్రులు "ప్రెగడలకు నెందుమతి చమత్కృతియు సొమ్ము" అను నార్యోక్తిం దలంచి, యొకనాఁ డశోకునికడ కరిగి వినయభయభక్తులతో "దేవా! మేమొనర్చు విన్నపమును సావధానమతిఁ దామవధరింప వేడెదము. తామపరాధులను స్వహస్తములతో దండించుట తమ రాజఠీవికి లోపమని

మాకుఁ దోఁచెడు. కావునఁ దమ యాజ్ఞానుసారము దండవిధి నెఱవేర్ప నొక యధికారిని నియమించుట లెస్స" యని విన్నవించుకొనిరి.

మంత్రులమనవి నాలించి చక్రవర్తి నాలోచించి ప్రభుత్వమునుండి శిక్షావిధానము నెఱవేర్ప నొక యుద్యోగిని నియమించెను. రాజుచే మరణదండనము విధింపఁబడిన వారిని వధ్యస్థానమునకుఁ గొనిపోయి చంపుటయే వాని కార్యము. అయ్యుద్యోగమునకై నియమింపఁబడిన వాఁడొక దానవ స్వభావుఁడు. వానికి జాలి, జీవకారుణ్యము, మృదుభావము మొదలగు సద్గుణము లేమాత్రమును ఉండెడివి కావు. వానిరూపమే భయంకరము. వాని కృత్యములం గాంచినవారికి వానిగుండె ఱాతితో సృష్టింపఁబడియుండవలయునని తోఁచెడిది. వాఁడు నిర్దయహృదయుఁడై మాతాపితలను వధించిన క్రూరుఁడు.

రాజుచే నేర్పఱుపఁబడిన వధ్యస్థానము మనోజ్ఞమగు నొక యుద్యానవన మధ్యమున నుండెను. దానిని జూచినవారదియొక యాశ్రమపదమనియే యనుకొనునట్లు మిక్కిలి సొంపుగ నుండెను. మొదట నా వధ్యస్థానమునకు మరణదండనము విధింపఁబడినవారు మాత్రమే పంపఁబడుటయుఁ జంపఁబడుటయు జరుగుచుండెడిది. తరువాత నాశ్రమపదమను నూహతో దానిఁ బ్రవేశించిన వారిలో నొక్కఁడయినను ప్రాణములతో బయట

టకువచ్చిన జాడలేదు. నిరపరాధులగు పాంథులనేకు లా వధ్య స్థానముండు నుద్యానవన మెవఁడో యొక మునీంద్రుఁడుండు నాశ్రమముగా భావించి, యందుఁ బ్రవేశించి, యనేక యమ యాతనల కగ్గమయి తుంగకసుపుల దొలంగుచుండిరి.

ఇట్లుండ బాలపండితుఁడను మునివర్యుఁడొకఁడా వధ్య భూమియగు నుద్యానవనము నొకనాఁడు సేరెను. అతఁడు యాత్రార్థియై బయలువెడలి నానాదేశములఁ ద్రిమ్మరుచు నాఁటిదినమచ్చటికిఁ జేరుసరికెండ యతితీక్ష్ణముగఁ గాయు చుండెను. అందుచే నాతఁడు కడుడస్సి, యా యుద్యానవనము తనవంటి యొక తపసి యాశ్రమస్థలమని భావించి యందొక వృక్షచ్ఛాయఁ గూరుచుండెను. ఇంతలో వధ్యస్థానాధికారి యట కరుదెంచి యాతని చేతిని బట్టుకొనుటయు, నతండు దిగ్భ్రాంతిఁజెంది "అయ్యా! నే నేయపరాధ మొనర్చితిని. నన్ను మీరిట్లు పట్టుకొనఁ గారణమేమి?" యని ప్రశ్నించెను. అప్పు డా యుద్యోగి యతనిం జూచి "అయ్యా, ఇట నీవేమియు మాటాడరాదు. ఈ యుద్యానవనముం బ్రవేశించినవారినెల్ల వధ్యస్థానమునకుఁ బిలిచికొనిపోయి, యందు నానావిధ నరక యాతన లనుభవింపఁజేసి, తుదకు వారి ప్రాణములం దీయవల యునని రాజాజ్ఞ" యనెను. వానిమాట లాలించిన యాబౌద్ధ ముని కలతఁజెంది, కొంతవడికిఁ దెప్పిరిల్లి మార్గాంతర మొండు గన్పట్టమిం జేసి "సాధువర్యా! దండనమిట్లు నాకుఁ దారసిల్లునని

తలంచినవాఁడఁ గాను. దైవికముగా నిది తటస్థించినది. విధిని దప్పించుకొన నెంతవారికి నలవికాదుగదా! ఇఁక నేనెంతటి వాఁడ? అయినను దేవునిఁ బ్రార్థించుకొన నాకు రెండు గడియ లవకాశమిమ్ము. తరువాత నన్ను నీవేమిచేసినను సరియే. ఈ మాత్ర మనుగ్రహింపు"మని ప్రార్థించెను. అట్లే యతఁడాముని కవకాశమొసంగెను. పిదపఁ గొంతసేపున కతని భగవద్ధ్యానము ముగియఁగనే వధ్యస్థానాధికారి యాతనిఁ దెర్లుచున్న యొక నూనె కప్పెరలోఁ బడఁద్రోసెను.

ఒక్కింతతడవున కాతనిస్థితిఁ గనుఁగొనఁదలంచి యా యుద్యోగి కటాహములోఁ జూచెను. ఏమి యాశ్చర్యము! ఆ ముని యందు సరోవరంబున వికసించియున్న తామరవలెఁ బ్రకాశించుచు భగవంతుని స్తుతించుచుండెను. అప్పుడాతని కేమి చేయుటకును దోఁపక పఱువిడిపోయి రాజనగరుం బ్రవేశించి యశోకున కీ వృత్తాంతము నివేదించెను. అశోకుఁడును గొంత వడి సంభ్రమాశ్చర్యములకు గుఱియై యేమియుఁ బలుకకుండి, తటాలునలేచి యామునిం దనకుఁ జూపుమని యుద్యోగి ననుసరించెను. ఇరువురును వధ్యస్థానముం జేరిరి. దండవిధి నిర్వాహకుఁడు కప్పెరలోని మునిని రాజునకుం గాన్పించెను. అప్పుడా రాజేంద్రుని హృదయపరివర్తనముం గూర్చి యేమని వచింపఁ గలము? ఆతని మానసమున మార్దవభావ మంకురించెను. వెంటనే యా మునిని బైకిఁదీయ నాజ్ఞాపించెను. తరువాత

భూమీశ్వరుఁడాయతీశ్వరుని చరణయుగముపైఁబడి, తెలియక కావించిన యపరాధమునకు క్షమింప నాతనిం బ్రార్థించెను. మునివర్యుఁడును నాతనిపై జాలిఁగొని దీవించి "ఇఁకమీఁద నెప్పుడు నిట్టి యకార్యములలోఁ బ్రవేశింపవల"దని మంద లించెను.

నాఁడే రాజా వధ్యస్థానముం బడఁగొట్టించి యాచోట నుద్యానవనమునే యింకను బెంపొందించెను.

జాతిగుండియగల యా వధ్యస్థానోద్యోగిని రాజా తెర్లు చున్న నూనెకప్పెరలోఁ బడఁద్రోయించి యమసదనమున కతిథిం జేసెను.



# ౬. అశోకుని తొలిమతము



అశోకునికాలమున మగధరాజ్యమందలి జను లేడు తెగలుగ నుండిరి అందు మొదటితెగవారు తత్త్వజ్ఞాను లను పేరితో వర్తిల్లుచుండిరి. వారితెగ చిన్నదైనను ప్రజలెల్లరిచేతను నది గౌరవింపఁబడుచుండెను. ఈతెగవారు కాయకష్ట మొనర్ప వలసిన పనిలేకుండెను. యజ్ఞయాగాదివైదిక కర్మల నొనర్చుట, దేవు నర్చించుట, మాత్రమే వారి కృత్యములు. రెండవజాతివారి సంఖ్య పెద్దదియుఁ బలుకుబడిఁగలదియు. వీరు కృషికులు నాఁబర చుండిరి. రాజునకు సమర్పింపవలసిన పన్నులలో వీరే విశేష భాగ మిచ్చుచుండిరి. వీరు తమ భూములమీఁద వచ్చు నాదాయమునుండి నాలుగింట నొకభాగముఁబన్నుక్రింద రాజున కిచ్చుచుండిరి. మూఁడవశాఖవారు బానిసలు. వీరు నీచవృత్తులలో నియమింపఁబడుచుండిరి. నాలవది వణిక్శాఖ. వీరు బాహాటముగ వ్యాపారములు సాగించుచు తాము పొందులాభములనుండి రాజునకు పన్ను లిచ్చుచువచ్చిరి. ఐదవది రాణువవారి తెగ. ఇదియుఁ బెద్దదియే. ఈ తెగవారికి యుద్ధకాలమునఁ దప్పఁ దక్కిన సమయములలోఁ బనిలేనందున వీరు తమ జీవితమునం దెంతయుఁ బ్రయోజనములేని పనులయందే గడపుచుండిరనవచ్చును.

ఇఱువది రాజునకు మంత్రాలోచనముచెప్పు వారితెగ. ఈ తెగ యుండియే రాజ్యాంగము సాగుట కనుకూలురగు నుద్యోగుల నెన్నుకొనుచుండెడివారు. వీరందఱును నార్యధర్మములనే యవలంబించుచుండినట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు.

దీనింబట్టి యశోకుఁడును ప్రప్రథమమున నుత్తమ హిందూమతానలంబకుఁడనియే యేర్పడుచున్నయది. అతఁడు పరమ శివభక్తుఁడు. అతఁడు తన పితృపితామహులవలె నత్యంతభక్తి మెయిఁ బ్రతిదినమును నఱువదివేల బ్రాహ్మణులకు మహేశ్వర పూజ నడుపుచుండెను.

అశోకుని రాజలక్షణములు మన స్వదేశప్రభువుల రాజలక్షణముల కించుకయుఁ దీసిపోయినవికావు. అతఁడును నేఁటి మనరాజులవలె సన్నియాడంబరములను, నాటోపములను గలిగి యుండెను. రాజేకాక యతని దాసీజనమును నతనితోఁబాటు పల్లకులలో నెక్కి యూరేగుచుండిరి. సాధారణముగ పండుగ పబ్బములయందట్టి దాసీజనము తాల్చు వస్త్రాభరణములు అంతఃపురకాంతలగు రాజ్ఞీమణులు దాల్చు వస్త్రాభరణముల కంటెఁ దక్కువైనవికావు. ఎల్లప్పుడును రాజు బరివేష్టించి విలాసినులుండువారు. రాజు వేఁటకుఁబోవునప్పుడు సైతము వారు పోవుచు, నట రాజునకు సంభవించు కష్టసుఖములలోఁ బాలుగొనుచుండెడివారు. అట్టి సమయములలో నేయబల

రాజున కుపచారము సలుప నిరాకరించునో యామెతల తెగ గొట్టఁబడుచుండెడిది.

అశోకుఁడు క్షత్రియవంశ్యుఁడు ; గాన నాతనికి వేఁటయం దెక్కువ మక్కువ. ఆతఁడు బౌద్ధమతము నవలంబించుటకు మున్ను మత్తుఁగలుగఁజేయు నాసవములను, మాంసాదులనుగూడ సేవించుచుండెను. మఱియు నొకొక్కప్పుడు రాజోద్యానవాటికే, గుఱ్ఱములను, ఎద్దులనుగట్టి తోలించి వేడుకచూచెడివాఁడు. తఱచుగ గజయుద్ధములు, ఖడ్గయుద్ధములు, వృషభయుద్ధములు జరుగుచుండెడివి. రాజునకిట్టి పందెములపై మిగుల ప్రీతి.

అశోకుఁడు ప్రతిసంవత్సరమును దనపట్టాభిషేక మహోత్సవదినముం జరపెడివాఁడు. మరణదండనము విధింపఁబడి కొఱతఁ జాటఁబడినవారెల్ల నాఁడు విడువఁబడుట ఆచారముగనుండెను.

అశోకుఁడు పట్టణమునకు వచ్చినవెంటనే "దేవానాం ప్రియ" "ప్రియదాస" మున్నగు బిరుదములందెను. ఇందు "దేవానాంప్రియ" యను బిరుదముమాత్ర మవిచారమూలము. ఎందుచేతనన, నాశబ్దమునకుఁ "బశువువలె మూఢుఁ"డని యర్థము. ఇట్టి తిట్టుబిరుదమెందుల కాతనికిఁ బ్రశంసాబిరుద మయ్యెనో తెలియరాకున్నది. ప్రియదాస" యన "దేవునికిఁ బ్రీతి పాత్రుఁడగు దాసుఁ"డని యర్థము.

---

# ౭. అశోకుని బౌద్ధమతావలంబనము



కేవల మైహికరాజభోగములయందు మగ్నుఁడై యున్న యశోకుఁడెట్లు బౌద్ధమతముఁ బ్రేమించి యవలంబించెనను విషయమును మనము గమనింపవలసి యున్నది:-

అశోకుఁడు తన సహోదరుఁడగు సుమానునిఁ జంపెననియు, నట్టిసమయమున సుమానుని కాంత పూర్ణగర్భవతిగ నుండెననియు, నామె తన ప్రాణసంరక్షణార్థముఁ బాటలీపుర ప్రాంత గ్రామనాయకుని యింటికరిగి, యతని శరణముజొచ్చెననియు, నాదినమే సర్వలక్షణ సంపన్నుఁడగు నొక కుమారు నామె బ్రసవించెననియు, నతనియింటనే తన కుమారుఁడగు "న్యగ్రోధుని"తోడ నామె యేడు వర్షములకాలము గాపాడఁబడినదనియు నొక ప్రకరణమునఁ జెప్పియుంటిమిగదా !

న్యగ్రోధుఁడను నాబాలుఁడు యౌవనుఁడు కాఁగానే బౌద్ధధర్మములలో నారితేఱి సన్న్యాసియయ్యెను. తరువాత నతఁ డొక నాఁ డశోకుని నగరునకు సమీపమున రాజమార్గమున వెడలుచుండ, నాతని మనోహరమగు ముఖము దన్నాకర్షింప సౌధోపరితలస్థుఁడగు రాజాతనిపైఁ బ్రేమఁబాల్చి, భటులమూల

ముగ వాని రావించెను. అతఁడును వచ్చి రాజునెదుట నిలుచుఁబడెను. అతనిఁ జూడఁగనే రాజులేచి "మీ యిష్టముగు నాసనముగాగైకొనుఁ"డనెను. రాజవాక్యమాలించి యా బాలసన్న్యాసి నలువలంకులఁ బరికించి, తానుదక్క నా సమయమునఁ నట నవ్వరును సన్న్యాసులు లేకుంట నెఱిఁగి రాజాసనమును స్వీకరించెను. ఈచర్యం గాంచిన యశోకుఁడాతని సత్కరించి యతనికిఁ గావలసినవి యొసఁగి యతనిం గౌరవించెను.

మఱియు రాజాతనిని బౌద్ధమతముం గూర్చి బోధింపఁ బ్రార్థించెను. వెంటనే యాసన్న్యాసి యాతనికి బౌద్ధమత సిద్ధాంతముల నెల్ల విశదముగ నుపదేశించెను. వాని గ్రహించి భూపాలుఁడు బుద్ధదేవునియందును, నతని బోధనములందును మిక్కుల విశ్వాసముంచెను. అది మొద లాతఁడు బౌద్ధమత మవలంబించె నని యొక పక్షమువారి వాదము.

వధ్యస్థానాధికారిచే నూనె కప్పెరలోఁ ద్రోయఁబడియు బ్రతికిన "బాలపండితుఁ"డను బౌద్ధసన్న్యాసియే బౌద్ధమతాభిమానబీజము నశోకుని మానసక్షేత్రమున నాఁటెనని వేఱొక పక్షమువారి వాదము.

"హుయాన్ సాంగ్" అను చీనా యాత్రికుఁడు భరత ఖండమున కరుదెంచి బుద్ధమత క్షేత్రముల దర్శించి యటనటఁ గల విశేషములం గూర్చి వ్రాసిన గ్రంథములో "అశోకుఁ డుప

గుప్తుఁ"డను వానివలన బౌద్ధమతము నవలంబించెనని వ్రాసి యున్నాఁడు. ఈ యుపగుప్తుఁ డుత్తరమథురలో వసించుచుండిన సుగంధద్రవ్య.వ్యాపారియగు "గుప్తుని" కుమారుఁడనియు, నితఁడు వైశ్యకులమునఁ బొడమినవాఁడనియు, నితఁడు తన పదునేడవ యేట బౌద్ధభిక్షుకుఁడై, యిరువదియవయేట "అర్హంత" యను నున్నతపదవిం బొందెననియు, నితఁడు పర్వతగుహాలలోఁ జాల కాలము ధ్యానసమాధిస్థుఁడై యుండినవాఁడనియు హుయాన్ సాంగ్ తన గ్రంథమున వ్రాసియున్నాఁడు. ఇదియే నిశ్చయమని యొండొకపక్షమువారి వాదము.

ఉపగుప్తుఁడు బౌద్ధమతముం గూర్చి బోధించిన విషయము లశోకుని మనము నాకర్షించెను. కావున నతని నశోకుఁడు తన పట్టణముననే వసింప వేడుకొనెను. కాని యందుల కుప గుప్తుఁ డిష్టపడక పోఁగా, నశోకుఁడతనికిఁ దన రాజ్యముననే యొక పర్వతగుహను వాసస్థానముగ నేర్పఱచెను. ఆ గుహ యం దుపగుప్తుఁడు వసించి, దైవధ్యాన పరోపకారము లొనర్చుచుఁ గాలముం గడపెను.

అశోకుఁడు బౌద్ధమతమును స్వీకరించినతోడనే బౌద్ధక్షేత్ర యాత్ర సేయఁదలంచి, తన గురువగు నుపగుప్తునికిఁ దన మనో రథ మెఱింగించెను. అతఁడును నందులకు సమ్మతించి యశోకు

నితోఁ గూడఁ బయనమయి వెడలి యనేక బౌద్ధక్షేత్రములను దర్శించెను.

అశోకుఁడు, నుపగుప్తుఁడును బ్రప్రథమమున దర్శించిన క్షేత్రరాజము బుద్ధభగవానుని జన్మస్థానమగు "లుంబిని"వనము. ఆచోటికిఁ బోవఁగనే యుపగుప్తుఁ డశోకుం జూచి "రాజేంద్రా! ఇయ్యదియే బుద్ధదేవుని జన్మస్థలము" అని తెలిపెను. రాజా దేశవాసుల కనేక ధర్మములం జేసిన వెంటనే, యటనుండి తరలి "కపిలవస్తు" నగరమునకుఁ బోయిరి. పిదప బుద్ధుఁడు జ్ఞానముం గాంచిన "బుద్ధగయ" యను ప్రదేశమును, నందలి బోధి వృక్షమును దర్శించిరి. అట్లే యా సమీపముననున్న సారనాథపురిని సేవించి, దానిని విడిచి, శాక్యముని తాను గనుఁగొన్న మతసిద్ధాంతముల వ్రాసిన ప్రదేశమగు కుశీనగరమును గూడఁ జూచిరి. ఇంతియగాక వారు బుద్ధదేవ పదపంకజ చిహ్నితములగు మఱెన్నియో ప్రదేశముల వీక్షించిరి.

అశోకుఁడు పట్టాభిషిక్తుఁడయిన పదుమూఁడు వత్సరములకు మహానదీ గౌతమీమధ్యస్థమయి, బంగాళాఖాతతీరమునకుం జేరియున్న కళింగరాజ్యముపై దండెత్తి దానిని సయితము తన రాజ్యముతోడఁ జేర్చికొనవలయునని యెంచి, పెద్దసేనం గూర్చుకొని బయలు వెడలెను. అశోకుఁ డపరిమిత బలసమేతుఁడయినందునఁ గళింగమును సులభముగ స్వాధీనపఱచుకొనఁ గలిగెను.

ఈ కళింగదేశమునవే హిందూక్షేత్రరాజమగు పూరి నాఁబడు జగన్నాథము వెలయుచుండును.

కళింగదేశస్థులు మహాపరాక్రమశాలురు. కాన, వారు తమరాజ్య మన్యభూపాలు పాలగుట కొకమాత్ర నోర్చినవారు గారు. ఇరు పక్షములకు ఘోరసంగ్రామము సెల్లినది. ఈ మహా రణమున 150000 మంది బందీకృతులయిరనియు, 100000 జనులు మడిసిరనియు, నిట్టి యుద్ధములం దెన్నియో పర్యాయ ములు మిగుల నాయపడిన యోధులనేకులు తీవ్రబాధలకును నంగవైకల్యములకును నగ్గమయిరనియు నశోకుఁడొక శిలాశా సనమునఁ దెలిపియున్నాఁడు.

కళింగ సంగరమున ననేక సహస్రసంఖ్యాకులగు వీరవరులు ప్రాణములం గోల్పోవుటం గాంచిన యశోకుఁడు దయార్ద్రి హృదయుఁడై, యందఱుమనుష్యుల పోకడకుఁ దాను మూల మయినందులకు మిపులఁ బశ్చాత్తాపమునొంది తన జీవితకాల మున నిఁక నెప్పుడును యుద్ధమొనర్పనని శపథ మొనరించెను. అందులకుఁ దార్కాణముగ నతఁడు కళింగ యుద్ధయాత్ర యొన రించిన పిదప మఱెప్పుడును యుద్ధములకు బయలువెడలలేదని తెలియుచున్నది.

అశోకుఁడు కళింగయుద్ధమునకు ముందే బౌద్ధమతమున మక్కువగలవాఁడై యుండెను. ఆయుద్ధమునకుఁ బిదప నతఁ డొనర్చిన ప్రతినచే నతనికి "రాజర్షి" యను పేరు వచ్చెను. బౌద్ధమత సిద్ధాంతములలోఁ బ్రప్రధను మయినది "యహింస" యగుటఁ గళింగ యుద్ధానంతర మశోకుని మన మాముఖ్య సిద్ధాంతమువంకకుఁ బూర్తిగ మరలుసంతటి సంస్కారమునొంది, యిఁకెన్నఁడును బ్రాణిహింసనమును దన రాజ్యమునఁ బ్రోత్స హించక, సర్వభూతదయాపరత మెలంగవలయునను సద్బుద్ధి యతని కుదయించెను. అయ్యదియే యశోకునికి బౌద్ధమతము నందు భక్తి విశ్వాసములు గలిగించి, యతని బౌద్ధమతావలం బకుఁ గావించుటయ కాక, యతని పాలితులును "రాజాను మతోధర్మ" యను నీతి ననుసరించి, యతని మార్గమునునే చనునట్లొనర్పఁ గారణమయినది.



# ౮. అశోకుని నూతన స్వభావము



అశోకుఁడు బౌద్ధమతమును స్వీకరించుట యతని ప్రజలలోఁ గొందఱ కిష్టములేకున్నను నతఁడందుచేఁ దన పూర్వ క్రూర స్వభావమునుండి విరమించినందులకు మిగుల సంతసించిరి.

అశోకుఁడు బౌద్ధమతస్థుఁడయిన వెంటనే యప్పుడప్పు డొకటిరెండు దినములు నిరాహారవ్రతముతో బోధివృక్షమూలమున బుద్ధునివలెనే కూర్చుండి సచ్చింతన మొనర్చుచు వచ్చెను. అతని స్థితింగాంచి యాతనిరాణులు విసుగుం గనిరి. కావున వారిలో నొకర్తుకయగు తిష్యారక్షి యాబోధివృక్షమును మొదలంట నఱకివైవ నాజ్ఞాపించెను. తదనుసారముగఁ గొందఱు భటులద్దాని నిర్మూలింప, నశోకుఁడది కని మిగుల వగచెను. అతనికిఁ బూర్వమున్న దారుణస్వభావమే యిప్పు డున్నచో నా రాణియొక్కయు, నామె యాజ్ఞానువర్తుల యొక్కయు గతులేమయి యుండునో మన మూహించవచ్చును.

అశోకుఁడు బౌద్ధమతము నవలంబించుటకు ముందు బౌద్ధ భిక్షువులయెడఁ గడు నిరసనభావముం జూపుచుండెను. బింబి

సారుని పిదపఁ బట్టాభిషిక్తుఁడయిన యతని కుమారుఁడగు నజాతశత్రుఁడు బుద్ధదేవుని నిర్యాణానంతరము తన రాజధాని యగు రాజగృహమున బుద్ధుని జ్ఞాపకార్థమయి కట్టించిన యనేకములగు కట్టడములలోఁ గొన్నింటిని నశోకుఁడు రాజ్యమునకు రాఁగానే పడఁగొట్టించెను. బౌద్ధమత మవలంబించిన యనంతర మట్టి కట్టడములను గౌరవభావముతోఁ జూచి సంరక్షించుటయేగాక, బౌద్ధభిక్షుకీభిక్షుకులను సయితము మిగుల సత్కరించు చుండెను. వారును నశోకునియెడ నెక్కుడుగ నాదరముగనుఁ బఱచుచుండిరి. మఱియుఁ దనదివాణమునఁ గనిష్ఠులుగానియున్న యఱువదివేవురు బ్రాహ్మణ పౌరోహితులను దఱిమివైచి, వారి స్థానమున బౌద్ధభిక్షుకులను నియమించెనని తెలియుచున్నది. ఈకిటుకును గ్రహించిన యా బ్రాహ్మణులలోఁ గొందఱు బౌద్ధ భిక్షుకులై మరల నశోకునే యాశ్రయించిరి

అశోకుఁడు బౌద్ధమతమును గైకొనఁగనే వేటసైతము నిషేధి మము నుజ్జగించి, యందుకై వెచ్చించుకాలమును బౌద్ధభిక్షు వులకడఁ దన సందియములఁ దీర్చికొనుటకును, మానస బోధము లగు కాలక్షేపములలోను గడపుచుండెను.

అశోకుఁడెంత వీరబౌద్ధుఁడయినను మరణదండనమును మాత్రము మూలముట్టుగ నిలుపఁజాలకపోయెను. మఱియుఁ

గొన్ని మృగములను జంపుట దోషముగాదని యాతఁడు తెలిపి యుండెను. ఎద్దుల కాలుపట్టుట నాతఁడు డాటంకపఱుపఁజాల కుండెను. గుఱ్ఱములకుఁ గళ్లెములఁ దగిలించుట, ఎద్దులకు ముకు ద్రాడుపోయుట మున్నగునవి యాతఁడు కూడదని శాసించెను. సంవత్సరములోఁ దటస్థించు నేఁబదియాఱు పండుగదినముల లోను జేఁపలుపట్టరాదనియు, వేటాడరాదనియు నాతఁడు త్తరువుఁ గావించెను. కోళ్లను జంపఁగూడదని యాతఁడు తీవ్రముగ నాజ్ఞాపించెను. కాని యాతనికిఁ బ్రాణవంతములగు జీవములతో నొనరింపఁబడు యాగములను నిలుప శక్యము గాకపోయెను.

అశోకుఁడు బౌద్ధమతమును ద్వేషించువారి కేలాటి దండ నము విధించినవాఁడుగాఁడు. దానింబట్టియే బౌద్ధమతము హిందూదేశముననే కాక, సముద్రములకావలి ప్రదేశములలోను వ్యాపించఁగలిగెను. అన్నిమతములును నేదోయొక మంచి మూలాధారముతోడనే స్థాపింపఁబడినదని యశోకుని తలంపు. అందుచేతనే యతఁడు కొందఱు మతప్రచారకులవలెఁ దా నవ లంబించిన మతమును వ్యాపింపఁజేయుటకై కఠిన విధానములను గైకొన్నవాఁడుగాఁడు. అట్లు కైకొనియేయున్నచో నీపాటికీ మతము ప్రపంచమంతటను వ్యాపించియుండుననుట యందావం తయు నసత్యములేదు.

అశోకుఁడు బౌద్ధదేవాలయములకును మఠములకును విశేషముగ ద్రవ్యసహాయ మొనరించెను. మఱియు నతఁ డజీవికులకు నెక్కుడు సహాయముం గావించెను. అజీవికు లను వారు నిర్వాణముంగన్న యొకతెగ సన్న్యాసులు. వీరు గుహాలలో వసించువాడుకఁ గలవారు. అశోకుఁడు జైనులకు బ్రాహ్మణులకుం గూడ ద్రవ్యసహాయ మొనర్చినవాఁడే. అశోకుఁడు కాశ్మీరమునందలి బ్రాహ్మణుల కనేక దేవాలయములను గట్టించియు, నుద్ధరించియు నిచ్చి నుండెనని తెలియుచున్నది.

అశోకుఁడు తన శిలాశాసనములలోను స్తూపములలోను బ్రాహ్మణులకుఁ గూడ భిక్షము పెట్టవలయునని చెక్కించియున్నాఁడు. అంతియకాక, తన సామ్రాజ్యమందలి జైనులు మొదలగు నన్యమతస్థులును దన ప్రజలేయగుట వారి మతముం గూర్చి దురాక్షేపము లెవ్వరును బలుకరాగని యతఁడు శాసించెనని తెలియుచున్నది.



# ౯. అశోకుని బౌద్ధమత ప్రచారము



అశోకునికి మూఁడు మున్నూఱేండ్లనుండియే హిందూదేశమున బౌద్ధమతమేర్పడి కొన్ని భాగములలో మాత్రమయ్యది జనులచే ననుష్ఠింపఁబడుచు వచ్చినది. బుద్ధునిచే స్థాపింపఁబడిన బౌద్ధమత ధర్మముల నశోకుఁడవలంబించిన పిదప రెండున్నర సంవత్సరముల కతఁడు తద్వ్యాపనమునకై శ్రద్ధఁ గైకొనెను. అతఁడందలి పరమార్థముం గ్రహించినవాఁడగుట "ఏల యీ యత్యంతోత్కృష్టమతమును బ్రజలలో వ్యాపింపఁజేయకూడ వలయు"ననియు, "నీమత స్వీకారమువలన జను లమిత సౌఖ్య సంపద ననుభవింపఁగల"రనియు మనస్ఫూర్తిగ విశ్వసించి, బౌద్ధమతమును లోకమునఁ బ్రకటించు దృఢసంకల్పముం జేకొనెను. అందులకై యతఁడు తన శరీరధనకాలములను వెచ్చింపఁ బూనుకొనెను. అశోకుఁడాకాలమున సర్వజనరంజకుఁడగు పరిపాలకుఁడుగ నుండినందున నతని మనోరథ మీడేఱుటకుఁ దగిన సహాయ సంపత్తి ప్రజలనుండియే మిక్కుటముగ లభించెను. అశోకుఁడు బౌద్ధమతమునందంతటి యభిమానము వహించి తద్వ్యాపనమునకై దీక్షఁ బూనకున్నచో, నమ్మతమున కిప్పుడు

ప్రపంచమునఁ గల ప్రశస్తియుండియుండదు. బుద్ధునికాలమునను, నాయన యనంతరము మూఁడువందల యేండ్లవఱకును బుద్ధుని యుపదేశములు బౌద్ధులచేఁ బుణ్యభూమిగఁ బరిగణింపఁబడు గంగా యమునా మధ్యప్రదేశమున మాత్రమే యధికముగ వ్యాపించియుండినవి.

ఆశోకుఁడు బౌద్ధవేద ప్రచారార్థము తానే ముందంజ వైచినచోఁ బ్రజలలో ధనికులనికాని, దరిద్రులనికాని భేదము లేక యందఱును దన్ననుసరింతురని యూహించి, తానే యుపదేశకార్యమునకుఁ బూనుకొనెను.

అశోకుఁడు బౌద్ధమత మవలంబించినది మొదలు మరణించువఱకును నామతవ్యాప్తికిఁ దనచేనైన ప్రచారము సర్వవిధములఁ జేసెను. అశోకుఁడు తా నొనర్చిన ప్రయత్నములం గూర్చి తన శాసనములలో స్పష్టముగఁ దెలిపియున్నాఁడు. కొంద అశోకుఁడు బౌద్ధమత మవలంబించిన కొలఁది దినములకు రాజ్యపరిపాలనముం బరిత్యజించి బౌద్ధభిక్షువాయెనని చెప్పుచున్నారు. కాని, యది యాధారములేని గాథ. అశోకుని శిలాశాసనములఁ బరిశీలించుచో నతఁడు ప్రభుత్వమొనర్చుచునే మత ప్రచారకార్యముం గొనసాగించి నట్లెఱుకపడుచున్నది. రాజపుటానాలోని శాసన మీవిషయమును విశదీకరించుచున్నది.

అతని పట్టాభిషేకమయిన తరువాత నిరువదియొక్క వత్సరములు కతనిచేఁ జెక్కింపఁబడిన నేపాళదేశములోని శాసనములు సయిత మీవిషయమునే స్థిరపఱుచుచున్నవి. మఱియు ఫాహియాన్, హుయ్యాయాన్‌సాంగ్ మున్నగువారి గ్రంధములవలనఁ గూడ నతఁడు రాజుగనుండియే మతవ్యాప్తి గావించెనని యేర్పడు చున్నది.

అశోకుఁడు బౌద్ధమత ప్రచారమునకయి ప్రచారకులఁ బెక్కుమందిని నియమించి, వారిని హిందూదేశములోని యనేక భాగములకుఁ బంపెను. అంతియగాక భరతభూమికిఁ జేరని బర్మా, సింహళము మున్నగుదేశములకు సయిత మతఁడు ప్రచారకులఁ బంపెను. ఇట్లు పంపఁబడిన వారత్యంత శ్రద్ధవహించి, ప్రజలకు బుద్ధదేవుని బోధనముల నుపదేశించిరి

అశోకునిచేఁ బంపఁబడిన ప్రచారకులు మధ్య ఆసియా, ఐరోపాప్రాంతము, ఆఫ్రికా యుత్తరభాగము మొదలగు చోటులకు వెడలినట్లు శాసనముల మూలముగఁ దెలియుచున్నది. నాగరికతయన నేమో యెఱుఁగని హిమవత్పర్వతప్రాంత నివాసులలోను, హిందూదేశోత్తర భాగముననుండు నడవిజాతులలోను బుద్ధుని యహింసా సిద్ధాంతము వ్యాపింపఁజేయఁబడెను. మధ్యహిందూస్థానము, దక్షిణాపథము మొదలగు ప్రదేశముల

కును బౌద్ధప్రచారకులు పోయి తమ మతమునాటిరి. మఱియు భరతఖండములోని యనేకమారుమూలప్రదేశములలోఁ గూడ బౌద్ధమతధర్మ ధ్వజకాంతులు పిక్కటిల్లెను.

మతవ్యాపనము విషయమున నే మతప్రచారకుఁడును నశోకునివలె శ్రద్ధఁగైకొని తా నవలంబించిన మతమును జనులలో వ్యాపింపఁజేయఁ బూనుకొనలేదని చెప్పవచ్చును. అశోకుని నిరంతర ప్రచారదీక్షకు ఫలితముగఁ బ్రపంచమునందలి యన్నిభాగములలోను బౌద్ధమతస్థులు నానాఁట నభివృద్ధిఁ గాంచుచుండిరి. మఱియు హిందూదేశము, బర్మా, సింహళము, సయాము, కంబోడియా, పశ్చిమహిందూద్వీపములు, చీనా, కొరియా, జపాను, మంగోలియా, తిబెత్తు మున్నగు దేశములలో బౌద్ధమత మఖండవిజయమును బడసి యంతకంతకు వర్ధిల్లఁ దొడఁగెను.

ఇట్లు దినదినాభివృద్ధి నందుచున్న బౌద్ధమతస్థుల మత సంబంధ విషయములను గమనించుట కశోకునిచేఁ గొందఱధికారులు నియమింపఁబడిరి. వారికి ధర్మమహామంత్రులని పేరు వీరికంటెఁ దక్కువపదవి నధిష్ఠించినవారు ధర్మయుక్తు లనఁబడు చుండిరి.



# ౧౦. బౌద్ధ మత సిద్ధాంతములు



మూలసిద్ధాంతముల విషయమున హిందూమతమునకును బౌద్ధమతమునకును నెక్కుడు భేదములేదు. జీవహింసవల దనియుఁ, బెద్దలను గౌరవింపవలయుననియుఁ, బరోపకారమొన ర్పవలయుననియు బోధించుటలో రెండు మతములును సమా నములే. కాని వర్ణాశ్రమాచార ధర్మములను విస్తారముగఁ బాటిం చుటనుబట్టి హిందూమతము బౌద్ధమతమునుండి భేదించుచు న్నది. ఈయొక్క విషయమునఁదక్కఁ దక్కిన యన్ని విషయ ములలోను నీరెండును నభేదములగుటఁ దా నుప్పతిల్లిన హిందూ దేశమున బౌద్ధమత మొక యన్యమతముగఁ బరిగణింపఁబడక హిందూమతములోని యొక శాఖవలెఁ గలసిమెలసి నట్లున్నది.

బౌద్ధమతస్థాపకుఁడగు గౌతమబుద్ధుఁడు భగవంతునిఁ గూర్చిగాని, కైలాసాది దేవావాసములఁ గూర్చి గాని తన యుపదేశములం దెక్కడను దడవలేదు. కాని, యాయన మానవులందఱును గష్టపరంపరలనుండి విముక్తినొంది సౌఖ్య ములఁ బొందుటకుఁ దగిన మార్గములం గూర్చి బోధించెను. ఆ మార్గముల ననుసరించి నడిచినచో నరులు జననమరణముల

వీడి యానందకందమగు నిర్వాణపదవి నందుదురని యాతని యభిప్రాయము. అశోకుఁడును బ్రజలకు మేలొనర్చుటయే తన ప్రధానకర్తవ్యముగ నెంచియుండినందున, నతనికి సౌఖ్యసంపత్సాధనములగు బౌద్ధధర్మమార్గములయం దెక్కుడు నమ్మకముకలిగి, వానినే యెల్లరనుసరించుట శ్రేయస్కరమని ప్రకటించెను.

బుద్ధభగవాను నొకప్పుడతని శిష్యులు దేవునిఁ గూర్చియుఁ బరలోకమును గూర్చియుఁ బ్రశ్నించినపుడాయన వారితోఁ "బ్రాణులకుఁ గీడురోయని విధముగఁ బ్రవర్తింపుఁ"డని యుత్తర మిచ్చెను. కావున, నాయన దేవుని విషయమునను బరలోకము విషయమునను 'నిదమిత్థ'మని వచింపక యహింసాసిద్ధాంత మును గుఱించియే యుపదేశించెను. "దైవం మానుషరూపేణ" యను న్యాయము ననుసరించి భగవదంశాసంభూతులగు మానవుల విషయమునను, దక్కిన జీవరాసుల విషయమునను నెవఁడు ప్రేమఁజూపునో వాఁడే దేవునిఁ గాంచుననియు, నగోచర ప్రభావుఁడగు దేవునిఁగూర్చి తర్కించుట యుచితముకాదనియు నాయన యాశయమైనట్లున్నది. కావుననే యాయన దేవుని గూర్చి యేమియుఁ జెప్పక యూరకుండెను.

అశోకుఁడును, జీవులపైఁ గనికరము చూపుట, దరిద్రులకు దానధర్మము లొనరించుట, అన్యమతస్థుల సన్నేహముగఁ

గాంచుట, త్రికరణశుద్ధిఁ గలిగియుండుట మున్నగునవియే మోక్షమార్గ సాధనములని యుపదేశించెను.

అశోకుఁడన్ని సిద్ధాంతములకంటె నహింసనే ప్రధానముగ నెంచినందున, నద్దానిని గూర్చియే విస్తారముగఁ బ్రచారము సలిపెను ఆతని తక్కిన బోధనములును సులభముగ బ్రతి యొక్కఁడును నవలంబింపఁదగినవిగ నుండెను.

తన మతగురునివలెనే యశోకుఁడును దేవునిఁ గూర్చిగాని, స్వర్గనరకములం గూర్చిగాని యెక్కడను బ్రస్తావింపలేదు. కాని, తన సత్ప్రవర్తనముచేతనే మానవుఁడుత్తమగతిఁ బొందవచ్చు నని వచించియుండెను.

అశోకుఁడు తన శిలాశాసనములలో నందందు జీవహింస కూడదనియుఁ, బెద్దలను గౌరవింపవలయుననియుఁ దెలిపియు న్నాఁడు. అతఁడు, కర్మానుసారము మానవుఁడు కష్టసుఖములఁ బొందునను హిందూసిద్ధాంతమునకు వ్యతిరేకముగ బోధించి నట్లు కానరాదు. బుద్ధదేవప్రోక్తమగు నిర్వాణవిషయము నాతఁ డామోదించెను. కాని పునర్జన్మము లేదనుట మాత్రము సమ్మ తింపఁడయ్యెను. అశోకుఁడొక శిలాశాసనములోఁ దాను శ్రమ పడునదంతయు, జీవులైహికాముష్మిక సుఖములందుటకొఱకే

యని వివరించియున్నాఁడు. మఱియుఁ దన మతధర్మబోధనముల నాలించి, శ్రద్ధతో నవలంబించువారు ప్రాపంచిక కష్టముల నుండి విముక్తిఁగాంచి, పరలోకసౌఖ్యములఁ జూఱగొందురని తెలిపియున్నాఁడు. ఆత్మానందమొందిన వారు ద్రవ్యము నితరులకును బంచిపెట్టుటయే యుత్తమ సౌఖ్యదాయకమగు మార్గమని యాతఁడుపదేశించెను.



# ౧౧. అశోకుని రాజ్య వైభవము



అశోకుని రాజ్య పరిపాలనాదికములం గూర్చి కనుఁగొనుట కతనిచే స్థాపింపబడిన శిలాశాసనములును, ఫాహియాన్, హ్యూయాన్‌సాంగ్ మున్నగు యాత్రికులచే వ్రాయబడిన గ్రంథములును మూలాధారములుగ నున్నవి.

అశోకుని రాజ్యము పశ్చిమోత్తరమున హిందూకుష్ పర్వతమువఱకును, నుత్తరమున హిమవత్పర్వతము వఱకును, దూర్పుపడమరలయందు సముద్రతీరముల వఱకును, దక్షిణమునఁ బెన్నవఱకును వ్యాపించియుండెను. ఆతని రాజ్య మాఫగనిస్థానము, బెలూచిస్థానము, గాంధారము మున్నగు ప్రదేశములలోను విస్తరించియుండెననుటకు నిదర్శనములుగ నా దేశములయం దటనట నతఁడు నిర్మింపించిన కట్టడములును, స్తూపములును, స్తంభములును నేఁటికిని వెలయుచున్నవి. ఆతఁడేనూఱు సన్న్యాసి మఠములను గాశ్మీరమునఁ గట్టించుటచే నయ్యదియు నతని రాజ్యమునఁ జేరియుండెనని యూహింపవలసి యున్నది. నేపాళరాష్ట్రము సయితము మాతని యేలుబడికిలోఁబడి యుండెననుటకు దృష్టాంతముగ నా ప్రదేశమున నతనిచే నాటఁ

బడిన శిలా స్తంభద్వయము తనరారుచున్నది. మఱియు నటనొక దేవాలయము మాత్రము గట్టించినది నేటికిని గనంబడుచున్నది

అశోకుని సామ్రాజ్యమున బర్మా, అసాము, దక్షిణ హిందూస్థానము మున్నగు ప్రదేశములు చేరియుండలేదనియు, యింతవఱకుఁ జేసిన పరిశోధనములవలనఁ దెలియుచున్నది.

అశోకుని ప్రధాననగరమగు పాటలీపుత్రము యమునా నదిగట్టున స్థాపింపఁబడినది. ఆ మహాపట్టణము రెండు నదులకు మధ్య నెలకొల్పఁబడియుండినచో నది శత్రువుల కభేద్యముగ నుండియుండును. ఆ నగరదుర్గమున కఱువదినాలుగు గవను లుండెడివి. వానిపై సుమారాఱునూఱుల గోపురము లొప్పారు చుండెడివి. ఆపురదుర్గముం బరివేష్టించి లోఁతైన యగడ్త యొుండుండెడిది. ఆప్రోలు తొమ్మిదిమైళ్ల నిడివియు, నొకటిన్నర మైలు వెడలుపును గలిగి వెలయుచుండెను. రామణీయకమున నది యమరావతి కీడుజోడై యలరుచుండెను. ఆపురి కలంకార భూతమగు రాజభవనము ప్రాచీనశిల్ప కళాకౌశలమును బ్రకట చుచు నివ్వటిల్లుచుండెను.

పాటలీపుర కార్యనిర్వాహక సభయందు ముప్పదిమంది సభ్యులుండెడివారు. ఈ సభాసభ్యులైదుగురేసివంతున గల

యాఱుపసంఘములుగ నేర్పడి నానావిధకార్యముల నెఱవేర్చు చుండిరి. అందు మొదటిది చేతిపనులను, రెండవది విదేశీయుల రాకపోకలను, మూఁడవది జననమరణ పరిగణనమును, నాలుగవది చిల్లరవస్తువుల బేరసారములు, కొలతపాత్రలు, తూనికరాలు మున్నగువానిని, నైదవది క్రయవిక్రయ వస్తు మూల్య నిర్ణయమును, నాఱవది యమ్మఁబడిన సరుకులమీఁది సుంకముల రాఁబడిని బరిశీలించు నధికారములతో నొప్పు చుండెడివి.

సామ్రాజ్యాంతర్గతములగు తక్కిన పట్టణములలోను నిదే విధముగ జరుగుచుండెను.

అశోకుఁడు రాజ్య పరిపాలనముం గొనసాగించుటకును ననేకశాఖల నేర్పఱచెను. అతని యేలుబడిని నీటిపాఱుదల విషయముం గమనించుటకు సయిత మొకశాఖ యేర్పడియుండెను. ఆశాఖ యత్యద్భుతముగఁ గార్యముల నిర్వహించుచుండెను. నదులకు వందలకొలఁది మైళ్లదూరములో నున్న గ్రామములకుఁ గూడ నీటివసతి గలిగింపఁబడెను. నీటిపాఱుదల వసతికై ప్రజలు నీటిపన్నుఁ జెల్లించెడివారు. అశోకుఁడు నీటి సౌకర్యార్థ మెన్నియో బావులను, చెఱువులను, త్రవ్వించెను. రాజు ప్రజల నుండి యాఱింట నొకభాగమును, నాలుగింట నొకభాగమును బన్నులు వసూలుచేయుచుండెను. అశోకుని కాలమున సహి

తము రాజోద్యోగులు లంచముల గ్రహించు దురాచారముం డినట్లు తెలియుచున్నది. కాని యాతఁడద్దానిం బోకార్ప సర్వ విధములఁ బ్రయత్నించి నట్లాతని శాసనముల మూలముగ నెఱుకవడుచున్నది.

అశోకుఁడు సర్వ రాజ్య వ్యవహారములను దాను స్వయముగ గమనింపఁ బూనినను, నది యాతనికి సాధ్యము గాలేదు. అతఁడు తన శిలాశాసనములలోఁ "ప్రజల కష్టసుఖములను స్వయముగఁ బరిశీలించి పరిపాలించుటయే పాలకుని విధ్యుక్త ధర్మ"మని నొక్కి చెప్పియున్నాఁడు. అందులకు నిదర్శనముగ నతఁ డేసమయమునం దయినను నెచ్చోటనయినను దన ప్రజలు తన్ను దర్శించి వారి కష్టసుఖములను నివేదించుకొన వచ్చునని శాసించియుండెను.

హిందూరాజులు వేగుల మూలముగఁ బ్రజల కష్టసుఖములను బరరాజుల రహస్యోద్యమములను గనుఁగొని వానికిఁ దగినరీతిఁ బ్రతీకార మొనరించుచువచ్చిరి. అట్లే యశోకుఁడును వేగులవాండ్రను నియమించి, వారి మూలముగఁ దన రాష్ట్రమునను జుట్టుపట్లనున్న యన్యరాజ్యములను జరగు వృత్తాంతముల నెప్పటికప్పుడు గనుఁగొనుచుండెను.

అశోకుఁడు తన పితామహునివలె గొప్పసేనను సమకూర్చెను. అందు రథగజతురగ పదాతులను చతురంగము

లుండెను. సేనలోఁ జేరినవారి కాతఁ డధికవేతనము లిచ్చి పోషించుచుండెను. అశోకుఁడు మూలబలమును గూడఁ జేర్చియుంచెను.

చంద్రగుప్తుని కనేకవిధముల సాయమొనర్చిన చాణక్యుఁడు తన నీతిశాస్త్రములో నౌకాసైన్యశాఖాధికారి సముద్రమున సంచరించు నౌకలనుగూర్చి జాగ్రత్తగ గమనించుచుండవలయునని వ్రాసియున్నాఁడు. దీనింబట్టి మౌర్యచక్రవర్తుల కాలమున నౌకాసైన్యము సయితముండెనని గ్రహింపవలసి యున్నది.

సైన్యవిషయములం బరిశీలించుట కొక ప్రత్యేకశాఖ యేర్పడియుండెను. ఈ శాఖయందు ముప్పదిమూఁడు సభ్యులుండిరి. వారును నొక్కొక్కదానియం దైదుగురు గల యాఱుసంఘములుగ నేర్పడి, తమ కర్తవ్యము నెఱవేర్చుచుండిరి.

అందు మొదటిసంఘము నౌకాసైన్య విషయములం గూర్చి తనధికారితోఁ గూడి యాలోచించుచుండెను. రెండవది సైనికులకుఁ గావలసిన యాయుధాది పరికర సంపాదనముం గూర్చి పనిచేయుచుండెను. మూఁడవది పదాతుల లోటుపాటులం బరిశీలించుచుండెను. నాలుగవది అశ్వసేనకు సంబంధించిన వానిం గమనించుచుండెను. ఐదవది రథబల సందర్భములం బరామర్శించుచుండెను. ఆఱవది గజసైన్యము నరయుచుండెను.

పూర్వ హిందూరాజుల యాజ్ఞలు వేదవాక్యములవలెఁ బ్రజలచే నాదరింపఁబడుచుండెడివి. అశోకుని శాసనములు నయితమట్లే యాతని పాలితులచే గారవింపఁబడుచుండెను. కావుననే, యశోకుఁడు బౌద్ధధర్మములను దేశమున సులభముగ వ్యాపింపఁజేయఁగలిగెను. ఆతని కాలమున మహామంత్రులు, యుక్తులు నను నధికారుల మూలముగ రాజ్యాంగ వ్యవహారములు నెఱవేర్పఁబడుచుండెను. అన్ని పట్టణములలోను, నరణ్యప్రాంత గ్రామములలోను గల ప్రజలను, ఆయా ప్రదేశములకు రాజుచే నియమింపఁబడిన ప్రతినిధులే రాజాజ్ఞానుసారము పాలించుచుండిరి. సామంతులును రాజ శాసనములఁ దలఁదాల్చి కప్పములు చెల్లించుచుండిరి.

అశోకుఁడు తన సామ్రాజ్యాంతర్గతములగు ముఖ్యభాగములకు రాజకుటుంబ సంబంధముగల రాజకుమారులనే పాలకులుగ నియమించుచుండెను. అశోకుఁడును రాజగుటకు ముందుగఁ గొన్నాళ్లు ప్రతినిధి పదవియందుండినవాఁడే యనుట మనము మఱువరాదు. అశోకుని శాసనముల మూలముగ, తక్షశిల, ఉజ్జయిని, తోశాలి, సువర్ణగిరి మున్నగు ప్రదేశములకు రాజకుటుంబమునకు సంబంధించినవారే ప్రతినిధులుగ నున్నట్లు తెలియుచున్నది.

రాజ్యమధ్యమునఁ గల యుతర భాగములను రాజుచే

నియమింపఁబడిన యధికారులు పరిపాలించుచుండిరి. వీరికి "రాజకాను"లని పేరు. వీరిప్పటి రాష్ట్రపాలకు (Governor) లకుఁ గల యధికారముతోఁ దుల్యమగు నధికారముం గల వారు. వారిక్రింద "ప్రాదేశకు" లను మండలాధికారు (Collector) లుండిరి. వారిక్రింద యుక్తులు, నుపయుక్తులు పనులు నడుపుచుండిరి. రాజునకును, నున్నతోద్యోగులకును సహాయభూతులుగఁ గార్యదర్శు (Private Secretary) లుండిరి. అప్పటి రాజ్యపరిపాలనక్రమము మొత్తముమీఁదఁ బొగడఁ దగినస్థితిలో నుండెనని మనము గ్రహింపవచ్చును.

భూమి పన్నులమూలముగ రాజభాండారమున కెక్కువ వచ్చుబడియుండెడిది. సేద్యపుభూములన్నియు రాజు స్వత్వములుగనే భావింపఁబడుచుండెడివి.

మౌర్యరాజులు దోషులను దండించుటలో మిగులఁ గఠినముగనే మెలఁగుచుండిరి. పన్నులియ్యనివారికిని, రాజు వేఁటాడు నరణ్యమునఁ బ్రవేశించువారికిని, బానిసలయొక్క చేతులనో కాళ్లనో ఛేదించువారికిని మరణదండనము విధింపఁబడుచుండెడిది. తప్పు సాక్ష్యము చెప్పువారికిని, అసత్యమాడువారికిని నంగవైకల్యము శిక్షగా విధింపఁబడుచుండెడిది. కొన్నివిధములగు నేరముల నొనర్చువారికి శిరోముండనము దండనముగా శాసింపఁబడుచుండెను.

# ౧౨. అశోకుని లోకోపకారములు



అశోకుని కాలమున వర్తకవ్యాపారములకు సంబంధించిన యేర్పాటులు మిగుల నభివృద్ధిం గాంచెను. ఎగుమతి దిగుమతులు నదులమూలముగను, గాలువలమూలముగను, బాటల మూలముగను జరగుచుండెను. పాటలీపుత్త్రమునుండి సింధు నదీతీరమువఱకు నశోకుఁ డొక పెద్దబాటను వేయించెను. ఇది వర్తకవ్యాపారములకును, రాకపోకలకును జాల ననుకూలముగ నుండెను. ఈ బాటయందు దూరమును గుర్తించుట కనువుగ మైలురాలను, ప్రయాణికుల సౌకర్యార్థమయి యక్కడక్కడ బావులను నిర్మించెను. మార్గమున కిరువంకలఁ జల్లని నీడల నొసఁగుటకు వృక్షముల నాఁటించెను. మఱియు నాఁడాదారి యందటనటఁ బాంథుల శ్రమాపనోదనమునకుఁ దగిన విశ్రమ స్థానములు (సత్త్రములు) గట్టించెను

అశోకునిచే నిర్మింపఁబడిన యన్నిమార్గములలోను పైఁ జెప్పఁబడినదియే చాల నిడివిగలది. తక్కినవానియందును జనుల కనుకూలములగు నదుపాయముల నాతఁడు గల్పించెను. ఆతఁడు మానవుల సౌకర్యార్థమే కాక పశ్వాదులకొఱకుఁగూడఁ గొన్ని మేళ్ల నొనరించెను. బాటలయం దక్కడక్కడఁ బశువులు నీరు

ద్రాగుటకై తోట్లు కట్టించెను. చెఱువులను ద్రవ్వించెను. వానికిఁగూడ విశ్రాంతి స్థలముల నేర్పఱచెను.

రోగపీడితుల కాతఁడు తగిన వసతులతో వైద్యాలయముల నెలకొల్పెను. ఔషధములకుఁ గావలసిన మూలికలఁ బైరు సేయించెను. మృగములకుఁగూడ వైద్యశాల లేర్పఱచెను.

కొందఱు పూర్వకాలమున వైద్యశాలలు మున్నగునవి లేవనియు, నట్టి సౌకర్యము లీనాఁడు పరదేశీయుల పాలనా మహిమచేఁ గల్పింపఁబడినవనియు నందుచేఁ బూర్వకాలముకంటె నిప్పుడెన్నియో మడుంగులు నాగరికత యభివృద్ధిఁగాంచెననియు నుడువుచున్నారు. ఈరీతి వచియించువారు పూర్వకాలమును గూర్చి యెంత నీచముగనైనఁ బలుకుట పరిపాటియైనది. కాని వా రశోకుని చరిత్రమును, మెగస్తెనీసు చంద్రగుప్తుని గుఱించి వ్రాసిన విషయములను, ఫాహియాన్, హ్యూయాన్ సాంగ్ మున్నగు చీనా యాత్రికు లప్పటి భరతదేశముం గూర్చి రచియించిన గ్రంథములను జూచినచో వారికిఁ బూర్వ హైందవజన నాగరికతయు, నప్పటి మహోన్నతస్థితియు స్పష్టపడఁగలదు.

అశోకుఁడు మతవిషయములోఁ బ్రజలకు సంపూర్ణ స్వాతంత్ర్య మొసంగియుండెను. తాను వీరబౌద్ధమతము నవ

లంబించినను బ్రజల నామతమునఁ జేరుటకు నిర్బంధించియుం డలేదు. సర్వమతములవారును దన సన్నిధానమున కరుదెంచి, తమ కష్టసుఖముల సమక్షమున నివేదించుకొనుట కెల్లరకును నవకాశ మొసగియుండెను. తనకడ నతఁడన్ని మతములవారికిని నుద్యోగవిధిని జీవనములు గల్పించియుండెను. అతఁడు తన శాసనములలో బౌద్ధభిక్షువులవలెనే బ్రాహ్మణులు గూడ గౌరవార్హులనియు, వారికిని భిక్షల నలుపవలయుననియుఁ దన ప్రజల కాదేశించెను.

అశోకుఁడు తక్షశిల మున్నగు ప్రదేశములలోని విద్యా స్థానములలోఁ గళలకుఁ బ్రాముఖ్యత గలిగించి, తన రాజ్య మున విద్యాకాంక్ష గలవారి కెల్లర కందుఁ బ్రవేశముం గలిగిం చెను. మఱియు నా విద్యాలయములలో రాజకీయశాఖ నొకట మొండేర్పఱచి, యందుఁ దన సామంత రాజపుత్త్రులెల్లరును జదివి యుత్తీర్ణులు గావలయునని శాసించియుండెను.

అశోకుఁడు శిల్పకళను నయితము బోషించెను. నానా విధ రాజభవనములను, చైత్యములను, దేవాలయములను, మఠములను, స్తూపములను మున్నగువానిని నిర్మించెను. ఆ కాలపుఁ గట్టడముల శిథిల భాగములు నేఁటికిని నక్కడక్కడఁ జరిత్రకారుల హృదయముల నాకర్షించుచుఁ దమ శిల్పకళా నైపుణ్యమును వేనోళ్లఁ జాటుచు వెలయుచున్నవి నాగరిక

తలోఁ దమ్ము మించినవారు లేరనుకొను పాశ్చాత్యులు సయి తము వానిం దిలకించి ముగ్ధులగుచున్నారు.

మొత్తమున నశోకుని పరిపాలనమునఁ బ్రజలకుఁ గలిగిన సౌకర్యము లతనికి ముందుఁగాని, వెనుకఁగాని పాలించిన వారి కాలమునఁ గలిగియుండలేదనుటయం దతిశయోక్తి యించు కయు లేదు.



# ౧౩. అశోకుని యుపదేశములు



అశోకుఁడు, తన బోధనములను గూర్చియుఁ, గార్యము లను గూర్చియుఁ, దన యుద్దేశములను గూర్చియు శిలాఫలకము లోను, శాసనములలోను, స్తంభములమీఁదను, గర్భగుహల యందును జెక్కించెను. అట్టి వానిని గూర్చి నాన మొక్కింత గ్రహింపవలసియున్నది.

అశోకుఁడు ముఖ్యముగ మున్నది యుపదేశముల నాజ్ఞా రూపములుగ శాసనములలోఁ జెక్కించెనని తెలియుచున్నది. కాని నేఁటికందుఁ గనఁబడుచున్నవి పదునాలుగు మాత్రమే.

అందు మొదటిదానిలో నశోకుఁడు జీవహింస చేయరా దని ప్రజలకు శాసించెను. అహింసా ధర్మమునుగూర్చి యశో కుడీ శాసనమునఁ గడుఁ జక్కఁగ వివరించెను.

రెండవదానియం దతఁడు తన సామ్రాజ్యమునందలి యెల్ల జీవరాసుల యెడలను జూపవలసిన దయాస్వరూప మిట్టిదని నిరూపించెను.

మూఁడవదానిలో బౌద్ధమతప్రచారకు లయిదేండ్ల కొక పర్యాయము దేశ సంచారము నొనరించి ప్రజలలో మతధర్మ

ప్రబోధముం గావింపవలయునని సూచించుటయు కాక, తాను స్వమతప్రచారణార్థ మవలంబించిన పద్ధతులం గూర్చి వివరించి, వానిని దన సంతతివారు సయితము తన యనంతరము తప్పక నడుపవలయునని యాజ్ఞాపించెను.

నాలుగవదానిలోను బై విషయముల ననువదించుచుఁ దన ప్రజలు మత విషయముల దన్ననుసరింపవలయునని తెలిపెను.

ఐదవదానిలో మానవులు సత్కార్యముల నొనరించుట కష్టమనియు, దుష్కార్యముల నతి సులభముగ చేయుదురనియుఁ, గాపున సాధ్యమయినంతవఱకుఁ బ్రతియొక్కఁడును సత్కార్యములవైపే తన బుద్ధిని మరల్చుట శ్రేయస్కరమనియు, నందుచే నిహలోకమందును, బరలోకమునను సౌఖ్యసంపదల నొందుట సుకరమనియుఁ జెప్పియున్నాఁడు. మఱియు నిందశోకుఁడు తన మతప్రచారకులం గూర్చి వివరించుచు, వారు ప్రజలకు సద్ధర్మముల నుపదేశించుటయు కాక, చెఱసాలలలో నుండు నపరాధులఁ బరామర్శించి, యందు నిర్దోషులగు వారిని విముక్తులఁజేసి తమ దయా స్వభావమును గనఁబఱచుచుండిరనియు నెఱిఁగించెను.

ఆఱవదానిలోఁ దన యుద్యోగులెల్లరును దమకు నియమింపఁబడిన కార్యములను శ్రద్ధతో సకాలమున నెఱవేర్పవలయు

ననియుఁ, దన ప్రజ లేయదనునన్నైనఁ దనకడ కరుదెంచి, తమ కష్టసుఖములంగూర్చి నివేదించుకొన నచ్చుననియుఁ జాటించెను.

ఏడవదానిలో నశోకుఁడు తన ప్రజలలోని బౌద్ధమతస్థులు మతసిద్ధాంతముల కేమాత్రము విరోధముగ నడుచుకొనరాద నియు, బౌద్ధమతద్వేషుల కెట్టి యపచారము నొనరింపరాద నియుఁ దెలుపుటయే గాక, బౌద్ధమతముం జేకొనని ప్రజలు కూడఁ బంచేంద్రియ నిగ్రహమును, త్రికరణశుద్ధిని బాటించి నడుచుకొనవలయుననియు, నన్యమతస్థుల నిందింపక యైకమత్య ముతో మెలఁగవలయుననియుఁ బ్రకటించెను.

ఎనిమిదవ దానియందు క్షేత్రయాత్ర లొనరించుటచేఁ గలుగు లాభములనుగూర్చియు, బీదసాదలకు దానధర్మములు చేయవలసిన యావశ్యతం గూర్చియు స్పష్టపఱచెను.

తొమ్మిదవదానిలో దయకు సంబంధించిన కృత్యములెట్టి వని యుదాహరించెను. పది పదునొకండను సంఖ్యలుగల యాజ్ఞా ద్వయమునఁ గూడఁ బై విషయమునే గూర్చియే ముచ్చటిం చుచు, భూతదయా సిద్ధాంతమున కంగములగు ధర్మములం గూర్చి వర్ణించెను.

పండ్రెండవదానిలో నే మతస్థుఁడును నన్యమతస్థుని దూషింపఁగూడదనియుఁ, దన ప్రజలెల్లరును సహోదర భావ ముతో నేకాభిప్రాయులై మెలఁగవలయుననియు బోధించెను.

పదుమూఁడవదానియం దతఁడు తా నొనర్చిన కళింగదేశ దండయాత్రకుఁ బిదపఁ దన మనస్సు బౌద్ధమతము వంకకు మరలుటం గూర్చియు, నందుచేఁ దన కామతమున విశ్వాసము జనించి, తా నద్దాని నవలంబించుటం గూర్చియుఁ, గళింగ యుద్ధమున జరిగిన ప్రాణిసంహారరూప మహాప్రళయముచేఁ దనకు సంభవించిన హృదయావేగముం గూర్చియు వచించెను.

పదునాల్గవ దానిలో నతఁడు తన కార్యములం గూర్చి సంగ్రహముగఁ జెప్పెను. మఱియు నందు లేఖకులు తెలిసియో తెలియకయో వ్రాసిన తప్పులను గణింపవలదని వేడికొనెను.

అశోకుఁడు తన యుపదేశాదికముల నీరీతి శిలాఫలకముల లోను శాసనములలోను స్తంభములలోను జెక్కించుటకుఁ గారణమేమన:—నవి నాటఁబడిన ప్రదేశములవఱకు వ్యాపించి యున్న తన ప్రజలను నీతిమంతులనుగ నొనర్పవలయుననియే. అతని యుద్దేశము ననుసరించియే యతని ప్రజలు చాలవఱకు బౌద్ధధర్మముల నవలంబించి నీతిమార్గమునఁ దమ జీవితముం గడపుచుండిరి.

అశోకుని కాలమున బౌద్ధవేద మత్యుత్కృష్టప్రచారముం గలిగెయుండెనని తెలిసెడిని. అతని లిఖితోపదేశములు గల శాసనములు దేశమునందలి యనేక భాగములలో నెలకొని

ప్రజల ననేకుల బౌద్ధమత ధర్మావలంబకులను జేయుటంబట్టి యాకాలమున జనులలోఁ జాలమంది విద్యావాసనగలవారు గనే యుండిరని మన మూహింపవలసియున్నది.

అశోకుని లిఖితోపదేశములన్నియు నాకాలమునం దార్యావర్తమున వాడుకలో నుండిన ప్రాకృతభాషలోఁ వ్రాయఁబడినవి. ఇది సంస్కృతముయొక్క ద్వితీయరూపమని చెప్పుదురు. కొన్ని శాసనముల నశోకుఁడాయాదేశభాషలలోనే చెక్కించి నాటించెను.

అశోకుఁడీరీతిఁ బ్రచారకులచే నొక వంకను, శాసనాదికములచే నొక వంకను మతప్రచారమును గావించుచుండెను.



# ౧౪. అశోకుని శాసనాదికములు



అశోకుఁడు, తన యాదేశములకు సంబంధించిన మొదటి శాసనమును నుత్తర హిందూస్థానములోని జబల్పూరు మండలమునకుఁ జేరిన 'రూప్ నాథ్' అను ప్రదేశముననుు, దక్షిణ బీహారునందలి 'సహస్రా' మను చోటను, జయపుర సంస్థానములోని దగ్గ 'బైరటు' అను గ్రామముననుు వెలయుచుండు శిలాఫలకములలో నుదాహరించియున్నాఁడు.

పైఁ జెప్పిన 'బైరటు' నకు సమీపమున 'బాబ్రా' యను ప్రదేశముగలదు. అందశోకుని శాసనమొకటి యున్నది. ఆ శాసనములో నశోకుఁడు బౌద్ధమత దేవాలయముల కొనర్చిన దానధర్మములం గూర్చి విస్తారముగఁ జెప్పఁబడియున్నది.

'సారనాథ్' 'కౌశాంబి' 'సాంచి' యను ప్రదేశములలోని శిలాఫలకములయందు, బౌద్ధమతాక్షేపకులకు విధింపఁబడు దండనముం గూర్చి వివరింపఁబడియున్నది.

నేపాళరాజ్యములోని 'రుమ్మిండి' యను ప్రదేశమున నశోకుఁడొక స్తంభమును స్థాపించెను. అందు లుంబినివనము

మొదలగు బౌద్ధక్షేత్రములకుఁ దా నొనర్చిన తీర్థయాత్రల గుఱించి ప్రకటించెను.

ఉత్తర హిందూస్థానమునందలి 'అంబాలా' మండలము నకుఁ జేరిన 'తోప్రా' ప్రాంతమున నశోకుఁ డొక స్తంభమును నాఁటియుండెను. దానిని 'ఫిరోజిషా' యను చక్రవర్తి, ఢిల్లీకి సమీపముననున్న ఫిరోజిషాబాదు నగరమునకుఁ దెచ్చి 'కోదిలా' అను తిప్పమీఁద నాటించెను. అందశోకుని యుపదేశములో మొదటి యేడును గనఁబడుచున్నవి.

'మీరట్టు' లో నహితమొక శిలాస్తంభ మశోకస్థాపిత ముండఁగా దానిని బైఁ బేర్కొనఁబడిన తురుష్క చక్రవర్తియే ఢిల్లీకిఁ దెచ్చి నాటించెను. అది యిప్పుడు విఱిగిపోయి, మిగుల శిథిలావస్థలో నున్నది. అందశోకుని యాఱుపదేశములు చెక్కఁ బడియున్నవి.

కౌశాంబిలోనుండిన మఱియొక స్తంభమును గూడ ఫిరోజిషా చక్రవర్తియే తీసికొనివచ్చి యలహాబాదు కోటలో నాటించెను. అందశోకుని యాఱుపదేశములు మాత్రమే గాక రాణి యాజ్ఞలకు సంబంధించిన విషయములును గలవు.

ఉత్తర బీహారురాష్ట్రములోని "ముజఫర్పూర్" మండలమందలి "బాసార్" అను ప్రదేశమున నశోకునిచేఁ గట్టింపఁ

బడిన శిలా స్తంభ మొకటి యున్నది. దాని పొడవు దాదాపు నలువది నాల్గడుగులు.

"చాంపరాను"మండలమునకు సంబంధించిన "రాంపూరు" "లారియా" యను గ్రామములకడ నశోకుని స్తంభములు గలవు. ఇందశోకుని యాజ్ఞాదేశములును మంచిస్థితిలో నగపడు చున్నవి. కాని మొదటిది నేల వ్రాలి క్షీణించుచున్నది. దీనికి సమీపముననే మఱియొక శిలా స్తంభమిట్టిదే వెలయుచున్నది.

మధ్య హిందూస్థానములోని భోపాలు సంస్థానమునకుం జేరిన "సాంచి"లోం గల శిలా స్తంభము క్రింద వ్రాలిపోయి విఱుగంబడియున్నది. ఇందు నయిత మశోకుని యాజ్ఞాజ్ఞలు గలవు.

వారణాసికి సమీపమునను౦డు "శారనాథ్" అనుచోట నొక శాసికంబమున్నది. అది విఱిగిపోయి క్షీణించుచున్నది. అందుం జెక్కంబడిన యాజ్ఞలన్నియు మంచిస్థితిలోనే యున్నవి.

నేపాళములోని 'నిక్లివా' యను ప్రదేశమున నశోకునిచే నిలుపంబడిన శిలా స్తంభ మొండు గలదు. అందతండొనరించిన క్షేత్రయాత్రలం గూర్చి వర్ణింపంబడియున్నది.

ఉత్తర పశ్చిమముల సరిహద్దు ప్రదేశమగు పెషావరు మండలమునకుం జేరిన యొక గ్రామమున నిరువది నాల్గడుగుల

నిడివియుఁ బది యడుగుల వెడలుపును గల యొక శిలాఫలక ముపై నశోకుని పదునాలుగాదేశములు చెక్కఁబడియున్నవి; కాని యిందు పండ్రెండవ యాజ్ఞ గనఁబడుటలేదు. ఇచ్చోటు నకు సమీపముననే గల మఱియొక శాసనములో నా పండ్రెం డవ యుపదేశ మగపడుచున్నది. ' మాన్సెరా ' యను ప్రదేశ మునఁ గల యొక శిలాశాసనమున బుద్ధుని యుపదేశములు చెక్కఁబడియున్నవి. అవి మంచిస్థితిలోనే యున్నవి.

సంయుక్త రాష్ట్రాంతర్గతమగు డేరాడూన్ మండలము నందలి ' కాల్సి ' యను గ్రామమున నొక శిలాశాసనమున నశోకుని యుపదేశములు చెక్కఁబడియున్నవి.

' తానా ' మండలములోని ' సొపారా 'లోను, ' కథియ వార్ ' సంస్థానమునందలి ' గిర్నార్ 'లోను నుండు శిలాశాస నము లశోకుని యాదేశములతో నొప్పారుచున్నవి.

ఒరిస్సా రాష్ట్రములోని ' పూరి ' మండలమునకుఁ జేరిన 'ధవలి' యను ప్రదేశమునను, గంజాము మండలమునకు సంబం ధించిన ' జయగడ ' యను చోటను నశోకుని కళింగ దండ యాత్రంగూర్చి ప్రకటించు రెండు శిలాశాసనములు గలవు.

మైసూరు రాజ్యమునందలి ' చిత్తాల్ద్రి 'గను మండలము నకుఁ జేరిన ' చిత్తపుర ' మను గ్రామమునను, ' జతింగరామే

శ్వరము' 'బ్రహ్మగిరి' యను ప్రదేశములలోను నశోకుని యాజ్ఞలకు సంబంధించిన శిలాశాసనములున్నవి.

నైజామురాష్ట్రములోని 'మాసి' యను పురమునఁగల శిలాశాసనము సహిత మశోకుని యుపదేశములతో వెలయుచున్నది.

'బారాపరర్' తిప్పలలోని గుహల నశోకుఁడు జీవికులకు నివాసార్థమై యొసఁగి, యందలి శిలాఫలకములపై వారిని గూర్చి కొన్ని విషయములను జెక్కించెను.

ఇవిగాక, యశోకుఁడు కళింగదేశ దండయాత్ర యొనర్చిన పిదప, నక్కడక్కడఁ గొన్ని జయస్తంభములను నాఁటించెను. వానియం దతఁడు, తన బౌద్ధమతావలంబనేచ్ఛం గూర్చియు, నాత్మపరిశీలనముం గూర్చియు, 'రాజికాను'లను నధికారుల కర్తవ్యములం గూర్చియు వివరించెను.

మఱియు నిట్టి శాసనములును స్తంభములును నశోకుని రాజ్యమున నుత్తరపుఁ గొననుండి పెన్నవఱకును వ్యాపించినట్లు తెలియుచున్నది; కాని యందుఁ బెక్కులు భూమిలోఁ బూడి క్షీణించుచున్నవి.



# ౧౫. అశోకుని స్తూపములు



అశోకుఁడు మూఁడేండ్లలో నాలుగువేల స్తూపములను స్థాపించెనని తెలియవచ్చుచున్నది. అతఁడిందులకై ధనమును ధారాళముగ వెచ్చించెను.

అశోకుఁ డీ స్తూపములను రాజ భవనములవలెను, సన్న్యాసి మఠములవలెను, జనసంచార మధికముగ నుండు ప్రదేశములలోఁ గాక, మారుమూలలలోఁ గట్టించుటచే, రాజ మందిరములకును, మఠములకును బట్టిన దుస్థితియే వీనికిని బట్టినది.

ఈ యిరువదియవ శతాబ్దారంభకాలమున మధ్య హిందూస్థానమునకుఁ జేరిన 'భూపాల్' సంస్థానమునందు దాదాఁపుఁ బది స్తూపములును, బౌద్ధులనడిన కొన్ని కట్టడము లును నుండెనని తెలియుచున్నది.

ప్రస్తుతము నిలిచియున్న స్తూపములలో 'సాంచి' యను ప్రదేశమునఁ గలది ముఖ్యమైనది. ఈ స్తూప మర్ధగోళకారముగఁ గట్టబడినది. దీని కొలత నూటపది యడుగులు. ఈ స్తూపము మంచిస్థితిలో నున్నపుడు, దీనియెత్తు డెబ్బదియేడున్నర యడు

గులుండెడిది. ఈ స్తూప స్తంభము లొక్కొక్కటియుఁ బదు నొకండడుగుల నిడివి గలది. దీని లోపలికిఁ బోవుటకు నాలుగు ద్వారములున్నవి. ఒక్కొక్క ద్వారముయొక్క పొడవు ముప్ప దినాలుగడుగులు. దీని దక్షిణ ద్వారమునం దశోకునిచే నెల కొల్పఁబడిన స్తంభ మొకటి యున్నది. అది యిప్పుడు శిథిలమయి విఱిగి క్రిందఁబడియున్నది. బాగుగ నుండినపుడు దీని పొడవు నలువదిరెండడుగు లుండెడిది. ఈ స్తూపమునకుఁ గొంతదూర మున ననేక స్తూపములు శిథిలములై పడియున్నవి.

భాగల్ఖండ దేశమునకుఁ జేరిన 'నాగోడ్' మండలము లోని 'భార్హట్' గ్రామమున నల్లరాళ్లతో నశోకునిచే నిర్మింపఁబడిన స్తూపమొకదానిని 1873 సం॥రమున 'సర్ అలె గ్జాండర్ కన్నింగ్హాం' మను నతఁడు కనుగొనెను. అది యిపుడు శిథిలమై యథాస్థానముననే యున్నది. అందలి కొన్ని భాగముల సింఁడియా దొరతనమువారు సంగ్రహించి, కలకత్తా వస్తుప్రదర్శనశాలలోఁ బెట్టియున్నారు. ఈ స్తూపద్వారబంధ ములలోను వాకిలి తలుపులలోను, బౌద్ధమతసంబంధ కథలును, బౌద్ధమత స్థాపకుఁడగు గౌతమబుద్ధుని చరిత్రమునకు సంబంధిం చిన కథలును నెంతో ముచ్చటగఁ జెక్కఁబడియున్నవి.

ఇంకను నశోకునిచే స్థాపింపఁబడిన స్థూపము లటనట వెల యుచున్నను నవి ప్రస్తుతము నామమాత్రావశిష్టములై గుర్తిం

పరాని స్థితిలో నున్నవి. ఇప్పుడు స్తూపమనంగా నేమి? అది యెందులకుం గట్టింపంబడుచుండెను ?— అను విషయములం గూర్చి కొంతవఱకుం దెలిసికొందము :—

‘స్తూపము’ లనంగా బుద్ధ నియొక్కయు, నతనిం బోలిన బౌద్ధమునులయొక్కయు నస్థులు సమాధి చేయంబడినచోటుల, వారి జ్ఞాపకార్థమై నిర్మింపంబడిన కట్టడములు. మఱియు బౌద్ధ మత విషయకముగ నేదే నొక యుత్కృష్ట సంఘట్టనము దటస్థించి యుండినచో, నద్దాని జ్ఞాపకార్థము గూడ నిట్టి స్తూపములు స్థాపింపంబడెడివి.

ఇందులకొక్క నిదర్శనము:— బౌద్ధమత స్థాపకుండగు గౌతమబుద్ధుండు నిర్వాణపదవిం బడసిన యనంతర మాతని యెముకల, నాతనియం దనురాగముగల బౌద్ధమతస్థులు సంగ్రహించి కొనిపోయి, తమ తమ రాజ్యములలో నాతని జ్ఞాపకార్థమయి స్తూపముల నెలకొల్పిరనుటను మనము గమనింప వలయును.

ఈ స్తూపము లాయాదేశకాల వర్తమానములకుం దగిన యట్లు నిర్మింపంబడుచుండెను. అశోకునికాలమునం గోళాకారము లుగను గుక్కుటాండాకారములుగను నల్లరాళ్లతో నవి కట్టింపంబడెడివి.

---

# ౧౬. అశోకుని యితర కట్టడములు; ప్రతిమలు



అశోకుఁడు తన రాజ్యమున ననేకస్థలములలో రాజభవనములను, సన్న్యాసిమఠములను కట్టించియున్నాఁడు. కాని వాని యందొక్కటియైన నిక్కాలమున సరియగు స్థితిలో లేమింజేసి యాకాలపు శిల్పకళా నైపుణ్యమును గాంచి యానందించు భాగ్యము మనకు లేకపోయినది.

"హ్యూయాన్-సాం" గను చీనా యాత్రికుఁడు రచించిన గ్రంథమునలన నశోకునికాలమునం దనేక కట్టడములు నిర్మింపఁబడినట్లు తెలియుచున్నది. అందుఁ బాటలీపుత్రమున నశోకునిచేఁ గట్టింపఁబడిన రాజమందిరమును నేనుఁగుల గవనియు నతఁడు చూచి విస్మయమంది, యవి మనుష్యులచేఁ గాక దేవతలచేతనే నిర్మింపఁబడి యుండునని వ్రాసియున్నాఁడు. మఱియు నతఁడశోకునిచే నిర్మింపఁబడిన యెనుబది స్తూపములను ననేక సన్న్యాసిమఠములను దాఁజూచినట్లు వ్రాసియున్నాఁడు. 'హ్యూయాన్-సాంగు' నకు ముందు వచ్చిపోయిన "ఫాహియాను" కూడ నశోకుని శిల్పకళాభిమానమును గూర్చి వివరముగఁ దన గ్రంథమున వ్రాసియున్నాఁడు.

అశోకుఁడు బౌద్ధమత మవలంబించిన తర్వాత నశోకారామమను నొక పెద్ద సన్న్యాసి మఠమును గట్టించెను. వెండియు నతఁడు నలాందా యను స్థలమున బౌద్ధసన్న్యాసులకు నివాసయోగ్యములుగ ననేక మఠముల నెలకొల్పెను.

అశోకుఁడిట్టి కట్టడములనే గాక, ప్రతిమలను సయితము గొన్ని చోటులలోఁ జెక్కించియుంచెను. ఈ ప్రతిమలు ప్రత్యేకముగను స్తంభములు మున్నగువాని యందును గూడఁ గాన్పించుచున్నవి. పాటలీపుత్త్రమునను 'టిడరాగి' యను చోటను నిట్టి విగ్రహములు పెక్కులు గలవు.

ఆగ్రాకును మధురానగరమునకును నడుమ "పార్కు-హా" మను గ్రామమున్నది. అంగవస్త్రముగల పొడవుగల పురుషవిగ్రహమొకటి నిలుచున్నట్లు నిర్మింపఁబడియున్నది. దీని ముఖ మఱిగిపోయినది; చేతులు విఱిగిపోయినవి.

"బెస్‌నాగ" రను చోట నేఁడుగుల యెత్తుగల స్త్రీ ప్రతిమయొకటి గలదు. దానికిని ముఖమును హస్తములును శిథిలము లయినవి.

"పాప్రా"లోని స్తంభములలో నొకదాని పై భాగమున గరుడవిగ్రహమొండు చెక్కఁబడియున్నది. మఱియొక స్తంభముయొక్క యుపరిప్రదేశమున సింహశిరస్సు తీర్పఁబడియున్నది. ఇంకొకదానిమీఁద సింహము తొలువఁబడియున్నది. ఈ కడప

టినె భూమిలోఁ బూడిపోయియుండ నెవరో త్రవ్వి వెలుపలికిఁ దీసియున్నారు. వేఱొక స్తంభముయొక్క యగ్రపార్శ్వమున నాలుగు సింగములు చెక్కఁబడియున్నవి. ఇదియు శిథిలావస్థలో నున్నది. ఒండొక స్తంభము కొసను సింహచతుష్టయముపై బుద్ధుని యాజ్ఞాచక్ర మమర్పఁబడియున్నది. వెండియు నొక స్తంభము చివర గంటవంటి ప్రతిమ మలువఁబడియున్నది.

అశోకునిచే నిర్మింపఁబడిన విగ్రహములును, దివ్యభవనములును, గోపురములును మఠములును మంచి నల్లరాలతో నెంతయు నందముగ నెసలారుచున్నవి. అవి నెలకొల్పఁబడి యిప్పటికి దాదాఁపు 2500 సంవత్సరములయినను, నాకాలపు శిల్పకళా ప్రాభవమును జాటుచు స్థిరముగ నిలిచియుండుటం బరిశీలించుచో నెరికైనను దప్పక సంతోషాశ్చర్యములు గలుగు ననుట కిసుమంతయు సందియములేదు. మన ప్రాచీన హైందవులు, లోకములోని యనేక భాగములలో వసించు వారడవి మృగములమాడ్కి నాగరికతయన నేమో యెఱుఁగక వనములలో సంచరించుకాలముననే, యెన్నియో కళలలోఁ బ్రావీణ్యముం గడించి దిగ్దిగంతములఁ గీర్తివహించి యుండిరని యిందువలన గ్రహింపఁగలము గదా! అట్టి ప్రాచీన హైందవ కళలకు నేఁడు వాటిల్లిన హైన్యస్థితిం దొలఁగించుట నిజ దేశాభిమానముగల సోదరుల కెల్లరకు ముఖ్యకర్తవ్యమని వేఱుగఁ జెప్పఁ నవసరముండదు.

అశోకుఁడిట్టి కట్టడములు మొదలగువానిని తాను స్వయముగ మాత్రమే కాక, ప్రజల తోడ్పాటున నయితము గట్టించెను. ప్రస్తుతము మనదేశమున నేదే నొక సత్కార్యము నెరవేర్చవలయునన్నచో, నందులకు దేశములోని జనసేవకుల సాహాయ్య మావశ్యకమగుచున్నది గదా! నిదర్శనముగ నెవరో యొక పుణ్యాత్ముఁ డేదే నొక మండపమునో, సత్రమునో నిర్మింపఁ దలంచు చున్నాఁడనుకొనుము. అతఁడు కతిపయ జనుల యొద్ద నుండి ధనము రాఁబట్టి యా సత్కృతిని సాగింపఁ బ్రయత్నించును గదా! ఇట్లే యశోకుని కాలమునందు ప్రజలు సామాన్యముగా మత సంబంధములగు విషయములఁ దమయంతట నైన సాయము జేయుచుండిరి. అట్టి ప్రజాసముదాయముచే నిర్వహింపఁబడిన కార్యములకు రాజు తానే యధ్యక్షకర్తగ నుండినవాఁడు. ఇట్టి యేర్పాటులవలననే యశోకుఁడు బౌద్ధమత ప్రచారకుఁడయి యున్నిదో మహాత్కార్యముల నొనర్పఁగలిగెను.



# ౧౭. సింహళద్వీపము : బౌద్ధమతము



అశోకుఁడు బౌద్ధమతమును సింహళద్వీపమునఁగూడ వ్యాపింపఁజేసెనని మనము ముందే చదివియున్నాము గదా! ప్రస్తుతము దానింగూర్చి సవిస్తరముగఁ దెలిసికొందము :—

అశోకుని రాజ్యము పినాకినీతీరమువఱకు వ్యాపించియుండినను, ద్రావిడదేశస్థులలో మాత్ర మనేకులు బౌద్ధమతము నవలంబింపకుండిరి. కాని, వా రాతని సత్కార్యములకెల్లఁ దమ వలననైన సహాయము నొనరించుచు వచ్చిరని మాత్రము తెలియుచున్నది. అశోకుని కాలమునకుఁ బిదప హిందూదేశములోని పలుభాగములఁ బ్రయాణము సల్పిన చీనా యాత్రికులు దక్షిణ యిండియాలోను ననేక బౌద్ధసన్న్యాసి మఠములుండె నని చెప్పియున్నారు. దీనింబట్టి దక్షిణ హిందూస్థానమునకును లంకకును నప్పటికే రాకపోకలేర్పడి యుండెనని యూహింపవలసియున్నది.

అశోకుఁడుజ్జయినికి రాజప్రతినిధిగా నుండినపు డాతఁడు 'చైత్యగిరి' యను గ్రామమునులో వసించుచుండిన 'దేవి' యను నొకతెను దనకు రాణిగఁ జేసికొనెననియు, నామెయం దతని

కిరువురు బిడ్డలు కలిగిరనియు, వారిపేరు 'మహేంద్రుఁడు' 'సంఘమిత్ర' యనియుఁ బై ప్రకరణములలో నొకదాని యందుఁ జెప్పియుంటిమి కదా!

కొందఱీమహేంద్రు నశోకుని కొమరుఁడనియు, మఱికొందఱతని తోడఁబుట్టినవాఁడనియుఁ జెప్పుచున్నారు. ఏది యెట్లున్నను, మహేంద్రుఁడను పేరుగల వాఁడొకఁ డశోకుని కుటుంబమున నుండెననియు, నతనివలన బౌద్ధమతము సింహళమున వ్యాపింపఁజేయఁబడెననియుఁ జరిత్రలు వాకొనుచున్నవి.

సింహళద్వీపమున బౌద్ధమతము ప్రచురించుట కశోకునిచే మహేంద్రుఁడు నియమింపఁబడఁగనే, యాతఁడు తనతోఁ గూడ గొందఱు బౌద్ధభిక్షువులను వెంటఁబెట్టుకొని, తనకుఁ గావలసిన బౌద్ధమత గ్రంథములను గైకొని దక్షిణ సముద్రతీరములో నేదే నొక ప్రదేశమునుండి లంకకుఁ వెడలెను. ఇట్లు ప్రయాణమయిన మహేంద్రుఁ డనుచరులతోఁ గూడఁ గొన్నాళ్లకు సింహళముఁజేరి యాద్వీపమును బాలించు ప్రభుని యనుగ్రహమును సంపాదించుకొనెను. అప్పటి సింహళదేశపాలకుఁడు "దేవానాంప్రియతిస్సా" యను నతఁడు. మహేంద్రు నాతఁ డాదరించుటయె కాక, యతని బౌద్ధమతోపదేశముల నాలించి, యచిరకాలముననే బౌద్ధమతావలంబకుఁడయ్యెను. తరువాత నతని ప్రజలలోఁ జాలమంది బౌద్ధమతమును స్వీకరించిరి.

సింహాళ భూపాలుఁ డశోకుని స్వీయముగ నెఱుంగకున్నను నతని ప్రఖ్యాతి నదివఱకే యాలించినవాఁ డగుటం జేసి, యాతని యందును, నతని బోధనములయందును విశ్వాసగౌరవములఁ గలిగియుండెను. కావున నశోకునిచేఁ బంపఁబడిన మహేంద్రుఁడు మున్నగు బౌద్ధభిక్షువులయం దత్యంత ప్రేమముం గాన్పించి, వారి బోధనములాలించి బౌద్ధమతముం గ్రహించెను.

మహేంద్రుఁడు సింహాళమునకుఁ బోవునపుడు దనతోఁ దన సహోదరియగు సంఘమిత్రను సహితముఁ దోడ్కొని పోయెను. ఆమె సింహాళ ద్వీపరాజ్ఞీ మణియగు "నసల"కును, రాజమాతకును, దక్కుంగల యంతఃపురాంగనలకును బౌద్ధ మత సిద్ధాంతములం గూర్చి యుపన్యసించి వారలఁ దన్మతావ లంబలఁ గానర్చెను. సంఘమిత్ర వయసునఁ జిన్నదయ్యును, వినయమునందును గార్యదీక్షయందును నిరుపమానురాలుగ వెలయుచుంటం గ్రహించి సింహాళనృపతి యామెకొక మఠముం గట్టించి యిచ్చెను.

సంఘమిత్ర సింహాళమునకు వచ్చునపుడు బుద్ధగయలోని బోధివృక్షశాఖ నొండుఁ దనతోఁ గూడఁ దీసికొనివచ్చి, యద్దాని నట నాఁటి పెంపొందించెనని యొక కథ వాడుకలో నున్నది. ఇందెంతవఱకు సత్యముగలదో మనము నిర్ణయింప నేరము. కాని, తిస్సాచే నొక బోధివృక్షము పెంపఁబడుటయు,

నతని యనంతరమది కొంతకాలమునకు క్షీణింపఁగాఁ, దత్తరు మూలమునుండి వేఱొక యంకురముద్భవిల్లి, యది నానాఁట నెదిగి యొక మహావృక్షమగుటయు, నాచెట్టు నేఁటికిని సింహళములోని యనూరాధపురమునఁ గాన్పించు చుండుటయు మాత్రము నిక్కువము.

సింహళ రాజ్యాధీశుఁడు బౌద్ధమతముం బరిగ్రహించిన పదంపడి, యశోకునివలెనే తన రాజ్యమున బౌద్ధమతమును వ్యాపింపఁజేయ శ్రద్ధఁ గైకొనెను. అతఁ డనూరాధపురమున బౌద్ధసన్న్యాసులకుఁ గొన్ని మఠములను గట్టించి యిచ్చెను. అతఁడు నిర్మింపించిన కట్టడములలో "దుపరామతగపా" యను నది మిక్కుల ప్రాముఖ్యమైనది. కొందఱా కట్టడముక్రింద గౌతమబుద్ధ జ్ఞాపకచిహ్నము లున్నవనియు, నవి యశోకునిచేఁ బంపఁబడినవనియు వక్కాణించెదరు.

సింహళమున బౌద్ధమతమును వ్యాపింపఁజేసిన కీర్తి మహేంద్రునకే చెందును. ఇతఁడటకుఁ జేరకమున్నక్కడి జనులు, నియతసిద్ధాంతరహితమగు నేదో యొక మతము ననుసరించి యుండిరనియు, మహేంద్రుని యుపదేశములను విని వారు కాలక్రమమున బౌద్ధమతము నవలంబించిరనియుఁ దెలియుచున్నది.

సింహళ నరపతి మహేంద్రుఁడు వసించుట కనువుగ నొక పర్వతగుహ నేర్పఱచెను. మహేంద్రుఁడు తన జీవిత

శేషమును సింహళద్వీపమున నే గడపెనని చరిత్రలు వచించు చున్నవి.

తిస్సాయొక్కయు, మహేంద్రునియొక్కయు ఘనతర కార్యదీక్షవలన నే బౌద్ధమతము సింహళ ద్వీపమున నైనను నొక్కింత నేఁటికిని బ్రచారమందున్నది.



# ౧౮. అశోకుని సంతానము



అశోకుని తండ్రియగు బింబిసార మహారాజు పదునాఱుగురు కాంతలం బెట్టవట్టననియు, వారియందు దానికి నూట యొక్కండ్రు సుతులు గలిగిరనియు మనము ముందొక ప్రకరణమునం జదివియుంటిమి గదా! వారిలో నొకండయిన వీతాశోకుండు సన్న్యాసియై రాజ భవనములోనే బిచ్చమెత్తికొని జీవించుచుండెనని తెలియుచున్నది. అశోకుని సహోదరులలోం గడపటివాండగు 'తిస్సా' యను నతండు కొంతకాలము రాజప్రతినిధిగా నుండి, తరువాతం బ్రాపంచిక విషయములయందు విరక్తిగలిగి సన్న్యాసి యాయెనని తెలియుచున్నది.

అశోకుండనేక యువతులను బెండ్లాడెను. అందుం బట్టమహిషి 'దేవి' యను నామె. ఈమెవలనం గలిగినవారే "మహేంద్రుండును; సంఘమిత్త్రయు. రెండవ రాణిపేరు "కరువాగి". ఈమెయం దశోకునకు "తివారా" యను సుతుం డుద్భవించెను. మఱియొక యామెపేరు "ఆశాంధిమిత్త్ర". ఈమె కశోకునివలన "కునాలుం" డను పుత్త్రుండు గలిగెను ఇంకొక యామె "తిష్యరక్షిత". ఈమె యత్యంత సౌందర్యవతి.

ఈమెయం దశోకుని కమితప్రేమమేర్పడి యుండెను. కాని యీ యువు రూపమునకుఁ దగిన గుణముగలది కాకుండెను.

అశోకునకు "జాలంకు" డను మఱియొక తనయుఁడు గూడ నుండినట్లు తెలియుచున్నది; కాని, యితఁడెవరి గర్భమునఁ బుట్టినవాఁడో యెఱుకపడుటలేదు. అశోకుని కుమారులం గూర్చి యనేకకథ లనేకవిధములుగఁ జెప్పఁబడుచున్నవి. అందుఁ గొన్ని విశ్వాసదూరములుగఁ గూడ నున్నవి. కావున వాని యాధార్థ్యముం గూర్చి మనమేమియు నిశ్చయింపఁజాలము. మచ్చున కట్టి కథలనుండి యొకదాని నిట ననువదించెదము :-

అశోకుని పుత్త్రులలోఁ "గునాలుఁ" డను వాఁడు మిగుల నందగాఁడు. కావున నతనిపై నశోకుని భార్యలలో నొకతె యగు "తిష్యరక్షిత" మదినిల్పి యతని ననేకరీతులఁ బ్రార్థించెను. కాని, మాతృభక్తి పరాయణుఁడగు కునాలుఁ డామె ప్రార్థనమును నిరాకరించుటయ గాక, యామె కట్టిబుద్ధి తగదని నయభయముల నెంతయో చెప్పెను. తిష్యరక్షిత హతాశురాలై, కునాలుపై నెట్లయినఁ బగఁదీర్చికొన సమయము వేచి యుండెను.

ఇంతలోఁ దక్షశిలకు రాజప్రతినిధిగఁ గునాలు నశోకుఁడు నియమించుటచే, నతఁడు సకుటుంబముగఁ దక్షశిలకేగి, యటఁ బ్రజాపాలన దక్షతతో వెలయుచుండెను.

అట్టియెడఁ దిష్యరక్షిత తన పగఁదీర్చుకొనుటకుఁ దగిన యదను సదియ యని యెంచి, యొక తంత్రము పన్నెను.—తక్ష శిలలోని కునాలుని మంత్రుల కశోకుఁడు వ్రాసినట్లుగ నొక యాజ్ఞాపత్త్రమును వ్రాసి, రాజముద్రికవైచి, దానిఁ దక్ష శిలకుఁ బంపెను.

ఆలేఖ యపుడే స్థానమునందున్న మంత్రులకు వార్తాహరు లందిచ్చిరి. మంత్రు లా యుత్తరమునందలి విషయముం గ్రహించి నివ్వెఱఁ బొందుచుండఁ గునాలుఁ డా విషయమేమని ప్రశ్నించెను. కాని మంత్రులు వచించుటకు నేరకుండిరి, వారా కమ్మ నాతని కొసంగిరి. కునాలుఁ డా పత్త్రమునందలి రాజా జ్ఞం జదువుకొని, మంత్రులను జూచి "భూపాలుఁ డాజ్ఞాపించిన ట్లొనర్పుఁ"డని యాదేశించెను. అప్పుడు వారాతనితోఁ "ప్రభు వర్యా! ఇందలి యాజ్ఞావిషయమున మాకొక్కింత సందియముగలదు. కావున మేము ఱేనికడ కరిగి ప్రత్యక్షముగ సమస్త వృత్తాంతమును దెలిసికొని, పిదప నెట్లు చేయవలసి యుండిన నట్లు చేయుదు"మనిరి. కాని, కునాలుఁ డందులకు సమ్మతింపక, ఱేనిముద్రల నతిక్రమించుట కష్టంగను నపచార మనియు, నట్లొనర్పినఁ దనయాన గలదనియు సచివుల బలా త్కరించెను. వారును జేయునది లేక, రాజు నాజ్ఞాపత్రమున నున్నయట్లు కునాలుని కనుగ్రుడ్డులం బెకలింపించిరి. తరువాత

నతఁడు తన భార్యతోఁ గూడఁ బురము వెలువడి యరణ్యములకుఁ బోయెను. కొన్నాళ్లిట్లడవుల ద్రిమ్మరువాఁ డొకనాఁడు పాటలీపుత్త్రమున కేఁగి, యా పట్టణమునందలి వీథులలోఁ జత్తారు. జేఁబూని బిచ్చమెత్తికొనుచుండ, సతీద్వితీయు, సుందరాకారు నాతని నరనాథుఁడు రాజసౌధోపరితలమునుండి వీక్షించి, పిలిపించెను. అంతట భూపాలునానతిమెయిఁ గునాలుఁడు తన వృత్తాంతమంతయు నివేదింపఁ సశోకుఁడాతఁడు తన తనయుఁడగుట యెఱింగి, మిక్కిలిఁ బశ్చాత్తాపమునొంది, యాతని పరితాపకరస్థితి కెంతయువగచి, రాజవైద్యుల రావించి యాతని కెప్పటియట్ల నేత్రములు కలుగునట్లు చికిత్స చేయించెను. తన కుమారుఁడగు కునాలునికిఁ గీడొనరించిన తిష్యరక్షితకు మరణదండనమును విధించెను.

ఈకథ ప్రపంచమునఁ బ్రచారము గాంచియుండు సారంగధర చరిత్రమున కించుమించుగ సాటియగుచుండుటచే, నెవరో యీచిత్ర చరిత్రమును గల్పించి యశోకుని కథలలోఁ జేర్చియుందురు. అంతమాత్రమున నిది విశ్వాసార్హము గాఁజాలదు.



# ౧౯. అశోకుని నిర్యాణము



అశోకుఁ డవసానదశయం దశోకారామములోని బౌద్ధ భిక్షువుల యుపదేశములను వినుచుండుటతోడను, సత్కార్యము లొనరించుటతోడను గాలముఁ గడపుచుండెను. అంతియ గాక యతఁడు దన భాండాగారమునుండి యనుదినమెంతయో ద్రవ్యమును బౌద్ధ సన్న్యాసులకును మఠములకును దానము సేయుచుండెను. దీనిఁ గాంచిన యతని సంతతివారు "రాజ భాండారమునుండి యిఁక రాజునకు ద్రవ్యమొసంగరా" దని ప్రధానుల కాజ్ఞాపించిరి. అశోకుఁడందులకుఁ గష్టంగను దురపిల్లి, తనకు భోజనభాజనముగ నుంచు సపరంజి పళ్లెమును నశోకారామమున కంపుచుండెను. ఈ విషయ మెఱింగి యతని పుత్త్రులు వెండిపళ్లె మాతనికిడ నియమించిరి. అశోకుఁడద్దానిని నయిత మశోకారామమునందలి బౌద్ధభిక్షువులకే సమర్పించుచుండెను. తుదకయ్యదియు మాన్పింపఁబడి మృణ్మయపాత్ర మొసంగఁబడెను. అయ్యదియు మఠమునకే చేరుచుండెను.

ఇట్లుండ నొక నాఁడశోకుఁడు తన ప్రధానిం బిలిపించి యిట్లనెను:- "మంత్రివర్యా! నేను నూఱుకోట్ల బంగారు టంక

ములను నాచే నొసర్పఁబడు సత్కార్యములకై యొసంగ నుద్దే శించితిని. అందిప్పుడర్ధ భాగముమాత్రమే చెల్లినది. తక్కిన సగము భాగమును జెల్లింపవలసియున్నది. కావున నాచే జయిం పఁబడిన యీ విశాల సామ్రాజ్యమంతయులకై దత్తమొసర్ప సంకల్పించితిని. కావున నీవు తడవుసేయక వెంటనే దానశాసన మును వ్రాసి తెమ్మనెను. అతఁడు నట్లే లిఖించి తేఁగా, నశోకుఁ డందుఁ దన ముద్రవైచి యతనిచే దాని నిడి "నీవిద్దానిఁ గొని పోయి యశోకారామమున నుండు నుపగుప్తుని కొసంగు" మని యాజ్ఞాపించెను. ప్రభుని యానతి నెఱవేర్ప నాతఁడరిగెను. అతఁడు మరలివచ్చులోపల నశోక చక్రవర్తి భౌతికశరీరము విడిచి నిర్వాణపదవిం గాంచెను.

అశోకుని తరువాత నతని సంతతివారేఁబదివేల బంగారు నాణెములను నశోకారామమునకుఁ జెల్లించియే సామ్రాజ్య మును స్వాధీనపఱచుకొనిరని తెలియుచున్నది

అశోకునికి వెనుకఁ బట్టమునకు వచ్చినవారిని గుఱించి పురాణము లనేక విధములుగఁ జెప్పుచున్నవి. అశోకుని శిలా శాసనముల ననుసరించి యతనికిఁ గరువాగియందుఁ గలిగిన "దివారా" యను నతఁడే తరువాతి రాజ్యాధిపతి యని తెలి యవచ్చెడి. కాని వాని స్థితియేమయినదియుఁ దెలియవచ్చుట లేదు. నాగార్జున పర్వతములలో "దశగథుఁ" డను నతఁడట

భిక్షులకు దానముచేసిన గుహలలోని వ్రాఁతలనుబట్టి యితఁడే యశోకునికిఁ బిదప వచ్చిన రాజులలోఁ జరిత్రకు సంబంధించిన వాఁడుగఁ గన్పట్టెడి.

అశోకుని యనంతరము సింహాసన మధిష్ఠించిన మౌర్య రాజు లసమర్థులయినందునఁ ద్వరలోనే మగధసామ్రాజ్యవైభవ మసుగంట మొదలిడెను. కడపట సంగవంశస్థులు బ్రాహ్మణులుదేశీ మగధరాజ్యమును స్వాధీనపఱచుకొనిరి.

అశోకుఁడు మత విషయములయందే కాక, రాజ్య విషయములలోను నెక్కుడు శ్రద్ధవహించియుండెను. మత విషయములలో నతఁడు, క్రైస్తవమతమును వ్యాపింపఁజేసిన "కాన్‌స్టాన్‌టైన్" రాజునకును, మహమ్మదీయ మతమును వ్యాపింపఁజేసిన "ఓమర్ కలీఫా" కును సాటి యనవచ్చును. హిందూదేశమునఁ బ్రసిద్ధి వహించిన మొగలాయి చక్రవర్తులగు "నక్బరు" "ఔరంగజేబు" లకుఁ గొంచెమేని నశోకుఁడు దీసిపోయినవాఁడుకాఁడు.

భరతఖండమున మౌర్యరాజ్యము కొంచెము తక్కువగ 900 సం॥రములు నెలకొనియుండెను. మౌర్యరాజ్యమును స్థాపించినవాఁడు చంద్రగుప్తుఁడు. ఆతఁడుత్తర హిందూస్థానమునందలి చిన్నచిన్న రాజ్యముల నన్నిఁటిని జయించి, తన సామ్రాజ్య

మునఁ గలుపుకొనెను. ఆతని యనంతరము రాజ్యాధీశుఁడయిన బిందుసారుఁ డిరువదెనిమిదేండ్లు రాజ్యపరిపాలన మొనరించెను. ఈతఁడు క్రొత్త రాజ్యములను సంపాదింపకపోయినను, దన జనకుచే నార్జింపఁబడిన సామ్రాజ్యమును బోఁగొట్టుకొనక, కాపాడి యశోకుని కొసంగెను. అశోకుఁడును నిజభుజపరాక్రమముచేఁ బినాకిని తీరము వఱకును రాజ్యమును విస్తరింపఁ జేసెను.

అశోకుఁడిట్లు తనకుఁ బ్రాప్తించిన విశాలరాజ్యము నేకచ్ఛత్రముగఁ బాలించి, సామ్రాజ్య శకటచక్రము లనఁదగు మత రాజకీయముల యిరుసుల మొలకువతో నడపి, తన యేలుబడిఁ గాంచి పరదేశస్థులు సయితము శిరఃకంప మొనరింపఁ జరించి, తన యశోలతికలు దశదిశ లావరించునట్లు గావించెను.

అశోకుని కీర్తి యింకను బ్రపంచమునఁ
జిరస్థాయియగుఁగాక !

సమాప్తము.



"Amirtha Gunabodhini Press," 302, Mint Street, Madras.